# భీష్మప్రతిజ్ఞ

నాటకము







రచయిత:

జె. వెంకట్రాజు, బి. ఎ.

(రిటైర్డు) అసిస్టెంటు కమీషనరు
దేవాదాయ ధర్మాదాయ శాఖ, ఆంధ్రప్రదేశ్

# భీష్మప్రతిజ్ఞ

నాటకము



రచయిత:
జె. వెంకట్రాజు, బి. ఏ.
(రిటైర్డు) అసిస్టెంటు కమీషనరు
దేవాదాయ ధర్మాదాయ శాఖ, ఆంధ్రప్రదేశ్

# పండితాభిప్రాయము

పలుకబ్బము లీవఱకే రచించిన నామిత్రు లిప్పుడు విశ్రాంతిఁ గొని వ్రాసిన యీ 'భీష్మప్రతిజ్ఞ' ను మున్ముందు చూచినమీఁదటఁ దమ 'లవకుశ' నాటకమునుగూడఁ దెచ్చియిత్తు మనిరి. భారతావనిని జన్మించినవా రెవ్వరైన నాబాల్యము వినుచున్నదియు, నానా భాషలలో నెందఱెందఱో మహాకవులు గద్యపద్యాత్మకములుగా విరచించినవానిలోఁ గనుచున్నదియు నైనను, రంగస్థలానుభవమును, లోకజ్ఞతయుం గల యీ రచయిత కల్పితపాత్రములు రససిద్ధి కెంత వఱకుఁ దోడ్పడఁగలిగినదియు ముఖ్యముగాఁ బరికింపఁదగ్గదే.

ఆదినుండి యంతమువఱకుఁ గథానాయకు ననుగమించిన పురుష వేషధారిణియైన 'కల్యాణాభిధాన' నిజవృత్తము సత్యాద్భుతబుద్ధి శాలులా రాజామాత్యాదులకే దురవగాహముగా మెలఁగఁగలిగినను, గౌరాంగాఖ్య రాజవిదూషకుఁ డేనాఁడో కనిపెట్టి భవితవ్యమునుగూడ సూచింపఁజాలుటలో నాతని నగ్నసత్యప్రదర్శకతను గుర్తింపఁగలుగు దుము. 'తనువులుమాత్రమే వే' అనిపించు కల్యాణ దేవవ్రత సాహచర్యమున నొక్కట సర్పముబారినుండి తనను దప్పించి ప్రాణ దాన మొనర్చిన సంఘటనమున కెంతయు మెచ్చి 'యేమికోరిన నిత్తు' నన్నప్పు డా పాత్రము నోటనే 'గార్హస్థ్య' మనుటకుబదులు 'గార్హపత్య' మన్నదై, తుదకుఁ గన్నీరు తుడిచికొనుచు హిమాచల ప్రాంతారణ్యసీమలం బట్టవలసినప్పటి కది స్పష్టమగును. త న్నిరంతర సేవనము విషాదాంతాశాభంగపర్యవసాయియే యై జాలిఁగొలిపినను

దేవవ్రత స్వార్థత్యాగాగ్రగణ్యతకు మఱింత తార్కాణమై, తత్ప్రతిజ్ఞా భంగము కాకుండు నేకై కదీక్షకుఁ బోషకము కాకపోలేదు.

చైత్రరథప్రాం 'తాచ్ఛిద' నదీవరంబే కాలగతిని దత్తచ్ఛా పోపహతి నిక్షిప్తైన 'సత్యవతి' యన్నానో, సముద్రుఁడే తానయైన శంతనునిచే నెట్టైన వరింపంబడవలసినదే యాయెను. వాసిష్ఠశాపకారణ ముగా గాంగేయుఁడైన ప్రభాసుని శాపవిమోచనము దేవవ్రతు భీష్మతం గావలసె. తత్తదనుకూలపాత్రపోషణమే కర్తవ్యము. నిసర్గ కవితాధార గల యీ రచయిత యిందది సముచితముగానే సాధించిన వాఁడయ్యెను. పశుపతినే మెప్పింపఁజాలిన పార్థుతోఁ బది దినాలు కౌరవసేనాపతిగా నిలిచి యప్రతిహతముగాఁ బోరి తత్సారథ్యము నెఱపిన భగవానునిచేఁ జక్రముఁ బట్టించిన యద్వితీయ ధనుర్విద్యా విశారదుఁడైన యీ కథానాయకుఁడు స్వచ్ఛందమరణుఁడై యంప శయ్యపై నిల్చి 'భారతమునకుఁ' బంచమవేదత్వసంపాదకమైన ప్రబోధమెల్లఁ గావించిన సర్వలోకైకనిత్యసంస్మరణీయుని నిస్సంగత్వ మిందు సమర్థితమైనది ప్రశంసార్హము.

మచిలీపట్టణము
25-6-1968

విద్వత్కవిశేఖర, పండిత విమర్శక
యిత్యాది బహు బిరుదాంకిత
నాదెండ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రి

# ఆముఖము

'సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయం
ఏక మాపాతమధురం అన్య దాలోచనామృతమ్.'

సంగీత సాహిత్యములు రెండును ఆనందదాయకము లయ్యును సాహిత్యము ఆలోచనామృతముచే పాఠకుని పారవశ్యము నొందించును. కనుకనే దృశ్యకావ్యము సర్వజనసమ్మోదిత మగుచుండును.

నాటకరచన అసిధారవంటిది. సాహిత్యపరిణతికి నాటకరచన నికషోపలము. నాందితో నారంభమై భరతవాక్యముతో పరిపుష్టి నొందు నాటకము సర్వలక్షణలక్షితమై యుండుట రచయిత సాహితీ ప్రజ్ఞకు నిదర్శనము.

శ్రీ జె. వెంకటరాజుగారు నాటకరచనలో సిద్ధహస్తు లనుటకు వారు గ్రథించిన 25 నాటకములే తార్కాణములు.

అన్నిటికంటె నభినందనీయమైనది బహువిధపాత్రపోషణ. విదూషకప్రత్యామ్నాయముగా ప్రవేశింపబడిన 'గౌరాంగుడు', కథారసపరిపోషణకై కల్పింపబడిన 'కల్యాణి' నాటకమునకు మఱింత పుష్టిని, తుష్టిని కల్గించినారు.

రంగరాజు అమాయికతలోని అచ్చపుతీఱు, సత్యవతి ప్రసంగములోని చాతుర్యము, దాశరాజు పల్కులలోని పరువుందనము, మాతంగి మనస్సులోని నైసర్గికమార్దవము పాఠకుల మనస్సులందు ఘరపురాని ముద్రలై 'ఆహా' యనిపించక మానవు.

కల్యాణిదేవవ్రతుల యన్యోన్యస్నేహసల్లాపనిగూఢరీతి సహృదయులకొక నీతి. దేవవ్రతుని యచంచలదీక్ష యువకలోకమున కొక రక్ష. కల్యాణి నిస్స్వార్థసేవ నేటి మానవత కొక త్రోవ. గౌరాంగుని హాస్యచతురత లోకమున కొక గిలిగింత.

ఇందలి పాత్రల సంభాషణావైఖరి లోకోక్తిసమ్మిళితమై సహజసౌందర్యమును ప్రస్ఫుటము చేయుచున్నది. సత్యవతి " లోకం తీరే ఇది. జవ్వని కంటఁగన్పడిన చాలును మీ మగవారు పువ్వులున్ నవ్వులు గ్రుమ్మరించెదరు నాట్య మొనర్తురు గీత లేటివో దవ్వుల నాలపింతురు... " అని పల్కుటయు, గౌరాంగుడు " వలపువైత్యమ్ము పట్టినవాడు, ప్రేమయోగ మను పిచ్చిగొన్నాత డుర్విపైన చిక్కు వేదాంతమున తల జేర్చువాడు, కల్లుద్రావిన పిచ్చినక్కలు గదయ్య " అనుటయు స్వభావరమణీయములు.

సత్యవతి పలికిన " మానవులకు జరుగు మంచికి చెడ్డకు ప్రథమ కారణమ్ము విధి యొకండె "

గౌరాంగుడు వెల్లడించిన " చెఱిగిపోవచ్చు వ్రాతలు శిలలమీద నుదుటిపై శాసనమ్ములు కదుపనగునె "

ఈ భావాలు నిత్యసత్యములై జనతాబోధకము లగుచున్నవి. ఇట్టి వనేక మిందు దర్శింపనగును.

దేవవ్రతుని ప్రతిజ్ఞాపాలన, శంతనుని మానసికవ్యథ, కల్యాణి హృదయాందోళన పాఠకుల నూగిసలాడించి 'సెబాస్' యనిపించినవి.

ఇట్టి బిగువైన విచిత్ర వినూత్న సంధానముచే 'భీష్మప్రతిజ్ఞ' నతిరమణీయముగ నలరింపఁజేసిన శ్రీ జె. వెంకటరాజుగారు చరితార్థులై సాహితీరసజ్ఞశ్లాఘాపాత్రులైరి.

భావికాలమున శ్రీ వెంకటరాజుగారి లేఖిని భవ్యరూపకముల నెన్నిటినో సంతరించి సాహితీపిపాసువులకు సమారాధన చేయగలదని యస్మదాదుల యాకాంక్ష.

చక్కని భావశుద్ధియు ప్రశాంతగభీరపుసూక్తులున్ పసన్
జెక్కిన పాత్రపోషణపుజిల్గును సుందరసన్నివేశముల్
చిక్కని హాస్యభాషణము చెన్నుదలర్చిన శబ్దమాధురిన్
జక్కగఁ బోతపోసి వెదజల్లిరి 'భీష్మప్రతిజ్ఞ' ని మ్మహిన్.

భారతవీరగాథ యగు పావన 'భీష్మప్రతిజ్ఞ' నివ్విధిన్
వీరమతిన్ కవీశ్వరుడు వేంకటరాజు సలక్షణమ్ముగా
తీరిచి వింతసోయగపు దీప్తి వెలార్చి జగద్ధితమ్మునై
పేరిమి సంతరించె ; నిల పేరు గడించును కావ్యకాంతయున్.

శంతనుపుత్రు భీష్ముకథ సంస్తవనీయము నౌట నిచ్చలున్
సంతసమందుచున్ జనులు శ్రద్ధమెయిన్ పఠియించుచుందు; రా
శాంతయశంబు గల్గ గిరిజాపతి నల్వయు నిందిరామనః
కాంతుడు నోముగావుత జగంబున 'భీష్మప్రతిజ్ఞ' శోభిలన్ !

స్వస్తి. శివం భూయాత్

'సాహిత్య విద్యా భాషాప్రవీణ'
'మధురభారతి'
పండిత మల్లాప్రగడ శ్రీరంగారావు
మచిలీపట్టణము

# మనవి

నాటకాని కనుగుణమైనది వ్యావహారిక భాష. గ్రాంథికం కాదు. అందుచేత నా నాటకాల్లో ఉత్తమపాత్రలకు సాధ్యమైనంత శిష్టవ్యావహారికం వాడాను. నీచపాత్రలకు తత్తదుచిత గ్రామ్య ముపయోగించాను.

నాటకరచన విషయంలో నా అభిప్రాయాలు నా 'లవకుశ' నాటకంలో కొంచెం విపులీకరించి వ్రాశాను. ఒక్కసారి అది చూడండి.

ఈ నాటకంలో ఇతివృత్తం సుప్రసిద్ధ పురాణగాథ. దానికి భంగం లేకుండా రససిద్ధికోసం నాకు తోచిన మార్పు లక్కడక్కడ చేశాను. దేవవ్రతుని రాజ్య త్యాగం, బ్రహ్మచర్యాశ్రమ స్వీకారం ఒకేసారి జరుగనివ్వలేదు. ఆ రెంటికీ మధ్య చాలా వ్యవధి చూపించాను. ఇది కథాపటిష్ఠతకు చాలా సహకరించిం దనుకొంటాను.

ఇందలి ముఖ్యపాత్రలలో గౌరాంగుడు, అంశుమంతుడు, రంగరాజు, కల్యాణి, మాతంగి నాచే కల్పింపబడినవి. విదూషకుడు చాలవరకు లోకవ్యవహారాల్లోని నగ్నసత్యం బయటపెడుతుంటాడు. దాశరాజులాంటి పాత్రలు పారిశ్రామికసంఘాల మోతుబరులలో చూస్తూనే ఉంటాం.

తరుణవయస్కుడై, సద్గుణసంపన్నుడైన యువసార్వభౌము డొకడు జవ్వనుల నాకర్షించడం ప్రపంచంలో సామాన్యవిషయం.

ఈ అభిప్రాయంతో కల్యాణిపాత్ర సృష్టించాను. ఈ పాత్రను సృష్టించటంలో భీష్మప్రతిజ్ఞకు మరింత బిగివి, కథకు మరింత కళ వచ్చినట్లు సంతోషిస్తాను.

కొన్నిచోట్ల సంధులు కలుపలేదు. ఈ కాలపు నటకుల ఉచ్చారణ కనుకూలంగా శబ్దాలను విడి విడి గానే ఉంచాను. సులభ శైలి నడిపాను.

ప్రదర్శన ముఖ్యంగా తలంచి సూత్రధారుడు, విష్కంభం, చూళిక మొదలైన పాఠ్య నాటక లక్షణాలను తగ్గించాను.

మిత్రుల ప్రోత్సాహంతో ఇప్పుడు ముద్రణచేయించాను. వారికి నా ధన్యవాదాలు.

—రచయిత

# అంకితము

నాయనఅన్న బిడ్డడును, నా గురుమూర్తియు, నాత్మవేది, సు
శ్రీయుతు, డెల్లవిద్యలు నశేషము నేర్చిన సత్కవీశ్వరుం,
డాయతకీర్తి, జిన్పని కులాగ్రణి కంకిత మిత్తు సూర్యనా
రాయణరాజమౌళికి కళామతి కియ్యది గ్రంథరాజమున్.

# ముఖ్య పాత్రలు

పురుషులు :

దేవవ్రతుడు : కథానాయకుడు

శంతనుడు : దేవవ్రతుని తండ్రి. హస్తినాపుర ప్రభువు

గౌరాంగుడు : రాజవిదూషకుడు

అంశుమంతుడు : ప్రధాని

దాశరాజు : పల్లెసీమకు రాజు

రంగరాజు : దాశరాజు కొడుకు

స్త్రీలు :

కల్యాణి : పురుషవేషధారియై దేవవ్రతుని కొలిచిన రాజకన్య

సత్యవతి : దాశరాజు పెంపుడుకుమార్తె

మాతంగి : దాశరాజు భార్య.

# నాంది

శృంగారమ్ములు పొంగు యౌవనమదోద్రేకమ్ము చల్లారి ని
స్సంగత్వ మ్మెటులొందెనో ! విపుల రాజ్యశ్రీ నెటుల్ వీడెనో
సాంగోపాంగము తాను వృద్ధపితకై ! అబ్బా ! మహాభీష్మ మీ
గంగాపుత్రుడు నేడు చేసిన ప్రతిజ్ఞల్ ! రెండు రెండేకదా !

# ప్రథమాంకము

## 1-వ దృశ్యము

## హస్తినాపురి కోటలో రాజాస్థానము

[ కోట వెలుపలినుండి మహోరభసముగా నగరోత్సవ మంగళ వాద్యధ్వనులు, ప్రజల జయజయ ధ్వానములు వినబడుచుండును. శంతనమహారాజు అంశుమంతుడు ఉత్సవధ్వను లాలకించుచూ ప్రవేశింతురు. ]

శం : మహామంత్రిగారూ! మన నగరోత్సవా లెన్నడూ యింత మహావైభవంగా జరుగలేదేమో!

అం : లేదు మహాప్రభూ! లేదు...నేటి ఉత్సవాలు దేవవ్రత కుమారుని దిగ్విజయయాత్రాజయసూచకంగా జరిగేవి. ఇవి ప్రత్యేకప్రతిష్ఠ గలవి. ప్రజలందరూ ప్రత్యేకోత్సాహంతో పనులు చేస్తున్నారు. మేళధ్వనులు, జయజయ శబ్దాలు మిన్నుముట్టిపోతున్నవి. సామాన్యోత్సవాలు వీటి కెలాసరిపడగలవు ప్రభూ! భానుబింబంవంటి బాల ప్రభువుల పవిత్రముఖదర్శనంవల్ల భూదేవి సంతోషంతో పొంగి పొరలిపోతున్నది. ఆయన యోధమూర్తి మాత్రమే

కాదు. ప్రజలందరికీ పట్టుగొమ్మ. అందరికీ తలలో నాలుక. ప్రజలాయనను ప్రేమిస్తారు, పూజిస్తారు ప్రభూ!

శం: ఉఁ హుఁ హుఁ... అబ్బాయి సార్వభౌమపట్టాభిషేకాని కన్నివిధాలా అర్హుడండీ!

అం: నిజమే ప్రభూ! యువరాజావారు సర్వలక్షణసంపన్నులు.

అతిబల స్థిరకాయ; మనంతవీర్య
విక్రమవిశాలవీరగంభీరముఖము;
ధర్మపరిపూర్ణరాజ్యతంత్రప్రశస్తి;
నరపతికి ముఖ్య మీ లక్షణమ్ము లధిప!

శం: అవునవును. అతని కీ లక్షణాలన్నీ ఉన్నవి...అయితే, దృఢనిశ్చయం ప్రధానలక్షణం కాబోలు స్వామీ!

అం: వారి దృఢనిశ్చయం అద్వితీయం ప్రభూ! పట్టిన పట్టు కోసం ప్రాణాలైనా ధారబోస్తారు. అపూర్వమైన సంఘటన లనేకం తార్కాణా లిందుకు....ఆనాడు మదపు టేనుగుల పోరాటం మరువలేముగదా! ఆ దంతులు రెండూ మదించి పోరాడుతున్నవి గజశాలలో. పరస్పర సంఘర్షణలో ప్రళయకాలఝాంకారాలు చేస్తున్నవి వాటి దంతాలు. ఆ భయంకరఘాతలకు పర్వతాలే బ్రద్దలు కావాలి. ఆ మధ్యభాగం మహామృత్యుముఖం. దానిలో చొరబడ్డారు యువరాజావారు. రెండుచేతులా రెం డేనుగుల తొండాలూ కుదించి పట్టుకొన్నారు. దంతాలకు వడి వేసి వెనక్కు ధట్టించారు....ఆహాహా!...ఏమిటో ఆ మహాబలం! ఆ ఐరావతాలు తన్నుకొన్నవిగాని జానెడు

ముందుకు సాగిపోలేకపోయాయి. ఫెళ్లుఫెళ్లున విరిగి పోయాయి వాటి కోఅలు. గీపెడుతూ గిఱ్ఱున వలయం తిరిగినవి యేనుగులు. తమ తమ స్థానాలకు పోయి తలలు వంచి దాగికొన్నవి. మావటివాండ్ర కప్పుడు మచ్చికైనవి. అప్పటికి శాంతించారు అబ్బాయి...ఈ పట్టుదల, యీ బలం, యీ సాహసం, యీ దృఢనిశ్చయం మానవ సాధ్యమా ప్రభూ! ఎందరో ప్రజలీ వింత యెన్నోవిధాల చెప్పుకొంటుంటారుగదా నేటికీ?

శం: ఉఁ హుఁ హుఁ...తాతలపేరు నిలువబెట్టేడు స్వామీ! మా ముత్తాతలు దుష్యంత భరత సార్వభౌములకు శరభ సింహ గజ శార్దూలాది మృగాలతో సయ్యాటలటగదా? పర్వతాలతో బంతు లాడేరటగదా!

అం: మూడు మూర్తులా చిరంజీవి ముత్తాతల ప్రతిమ. తాత తండ్రులకు తగిన బిడ్డ. మన్మథునిబోలిన మహాసౌందర్య మూర్తి. సకలవిద్యాపారంగతులు. వేదార్థవేత్త. ధర్మ చింతాపరాయణులు. తరుణవయస్కులు. ప్రభుపట్టాభి షేకానికి బాగా అర్హులు ప్రభూ!

శం: అర్హుడే. అర్హుడే...మాకూ మధ్యాహ్నం తిరిగి పోయింది స్వామీ!...ఇక...ఇక...

అం: ....ఇక....బాలరాజునకు పట్టాభిషేకం చేయదగ్గదే.

శం: అదే ఆలోచిస్తున్నాం స్వామీ!

పెద్దయు గాల మేలితిమి పృథ్వి;
ప్రజల్ సుఖముండి రెల్లరున్;

వద్దిక రాజ్యభారము ; యు
వ ప్రభువే తగువాడు దానికిం ;
దిద్దికొనంగలా డతడు
దేశము ; వాని భుజమ్ము జేరెనో
ముద్దులు గుల్కు రాజ్యరమ ;
ముందు ముహూర్తము నిర్ణయింపుడీ.

అం : తథాస్తు ప్రభూ!...చిన్నబాబు చిన్ననాడే శస్త్రాస్త్రాలతో సేతువు గట్టి గంగాప్రవాహ మరికట్టిన బాణవిద్యాపరి పూర్ణులు. వశిష్ఠమహర్షికి శిష్యులై వేదవేత్తలైనారు. దేవ రాక్షస గురులకు దీక్షైన రాజనీతిజ్ఞులు. పరశురాముని బోలిన ప్రచండరణవీరులు. అన్నిటిని మించి శంతన రాజేంద్రుల యౌరసపుత్రులు. సార్వభౌమ పట్టాభిషేకానికి యుక్తవయస్కులే....అయితే ముందు కల్యాణం, తదుపరి పట్టాభిషేకం మన ఆచారంగదా ప్రభూ!

శం : ఊఁ...వివాహం త్వరలో చేయిద్దాం....తగిన కన్యను తామే నిర్ణయించండి. అబ్బాయినికూడా ఆలోచించండి స్వామీ!

అం : చిత్తం. ఈ దిగ్విజయోత్సవాలు ముగిసినంతనే ఆ ప్రయత్న మారంభిస్తాను....అరుగో, ఇటే వస్తున్నారు యువరాజావారు.

(తాను వారి కెదురు నడచును)

దిగ్విజేతలకు స్వాగతం! బాలప్రభువులకు స్వాగతం!

(ముందు దేవవ్రతుడు, వెనుక కల్యాణుడు ప్రవేశింతురు)

దే : నమస్కారం తాతగారూ !

అం : కల్యాణమస్తు.

దే : నాన్నగారూ ! నమస్కారం.

శం : దీర్ఘాయుష్మాన్ భవ.

క : అయ్యా ! నమస్కారం.

శం : }
అం : } కల్యాణమస్తు

అం : ఆ అర్ధసింహాసనం అలంకరించండి యువరాజా ! కూర్చో కల్యాణా !

(కల్యాణ దేవవ్రతు లుచితాసనములలో కూర్చుందురు)

ఏం నాయనా ! తెంపులేకుండా దిగ్విజయోత్సవాలు నడుస్తున్నవిగదా ! మిమ్మల నిలా హస్తిపుర పౌరులెలా రానిచ్చారు ?

దే : తండ్రిగారిని దర్శించి వస్తామంటే విడిచారు తాతగారూ !

అం : మంచిది బాబూ ! మంచిది....సంతోషం....మీ మాటలే చెప్పికొంటున్నాం నాన్నగారూ నేనూ.

దే : ఏమది తాతగారూ ?

అం : ఇంకేమున్నది ? మీరు దిగ్విజేతలై తిరిగి వచ్చారు. మాకది మహానందంగదా !

దే : మా పెద్దలు, మా శ్రేయోభిలాషులు, మీ ఆశీస్సులతో అఖండదిగ్విజయమే అయింది తాతగారూ !

శం : విన్నాం చిరంజీవీ ! విన్నాం....అనేకచోట్ల మీ కద్వితీయ సన్మానాలు జరిగినవట కాదటయ్యా !

దే : జరిగినవి నాన్నగారూ ! నిజమే

హస్తిసామ్రాజ్య వీరరాజాధిరాజ
రాజమార్తండ శంతనరాట్కుమారు
నెవరుచేయరు సత్కార ? మెల్లచోట్ల
నరులు మమ్ముల గౌరవించిరి మహాత్మ !

అం : కాదుబాబూ ! ఈనాటి విజయం కేవలం యువరాజులదే. మీకు జరిగిన సన్మానాలకు కారణం మీరేనయ్యా !... అయితే... నాయనా ! ఎక్కడెక్కడ యే యే సన్మానాలు జరిగినవి బాబూ ?

క : అన్నిచోట్లా అఖండసన్మానాలే తాతగారూ !

రథగజతురగవీరపదాతికోట్లతో
చనుదెంచి యొకపురి సాగనంపె
నిఖిలరసాన్నపానీయకళాభోగ
మురల విందులు సేసె నొక్కనగరు
మరొకదేశము మాదు మార్గమ్ములందెల్ల
దివినంట మేల్మిపందిరులు వేసె
జైకొట్టికొనుచు పతాకహస్తు లనేకు
లనుగమించిరి మమ్ము నచ్చటచట

లక్షగజముల నిడె నొకరాజమౌళి
గిరిసమసువర్ణనిధు లిచ్చె మరియొకండు ;
నగరనగరాల రారాజనందనులకు
నెల్ల సన్మానములు జేసి రెల్లవారు.

శం : సంతోషం...దేవవ్రతా ! ని న్నెదిరించినవారూ నీతో పోరి నిన్ను మెప్పించినవారూ వీరు లెక్కడైనా తారసిల్లేరా ?

దే : ఆహా ! దక్షిణభారతం వీరభారతం నాన్నగారూ ! వీర శిఖామణులై మ మ్మెదిరించారేగాని పారిపోయిన భీరువులు మా కెక్కడా కనిపించలేదు.

గండభేరుండమై గగనమ్మునకు విస
రెన్నన్ను నొక విపరీతబలుడు
పెనుగొండయై మేము విడచిన శస్త్రవ
ర్షము నోర్చె నతిబలశాలి యొకడు
ప్రళయానిలమ్మై గుభాలున మనసేన
నెట్టి కొట్టెను జగజెట్టి యొకడు
క్రోల్పులియై కలగోండ్రించి మమ్ము ము
దల్కించి కొట్టె నుద్దండు డొకడు
దక్షిణమ్మున కేరళాంధ్ర మళయాళ
ద్రవిడ కర్ణాట మలయా మరాటజనులు
రూపమెత్తిన వీరపౌరుషబలమ్ము ;
లెల్లరున్ మమ్ము గని యెదిరించి రయ్య !

శం : నిజమే నాన్నా ! వెనుకటికి మా దిగ్విజయయాత్రలో కూడ దక్షిణభారతీయుల ప్రతాపదర్పాలు బాగా చూచాం. వారు వెలిచేది వీరయుద్ధాలకు కాదు. పాపానికీ, అన్యాయానికీ, అధర్మానికీ, వారు మనకు విన్రములు కావటానికి ప్రథమకారణం వారి ప్రభుభక్తిపరాయణత.

క : అదీ సత్యమే కావచ్చు ప్రభూ! కాని నేటి విజయానికి బాల ప్రభువుల మహాబలశౌర్యధైర్యసాహసాలే ప్రత్యేక కారణం. ఈ ఐరావతాన్ని అన్యవీరగజా లడ్డలేదు. ఈ ప్రచండసూర్య ప్రభలో యితరజ్యోతులు హీనప్రభలైనవి. ఈ భైరవపక్షి పైన తిరుగాడగా పరపక్షులన్నీ తలలు వంచినవి. యువ రాజావారి నెదిర్చి పోరి జయము పొందిన యోధుడు లేకపోయాడు మహారాజా!

అం : అవును కల్యాణా! ఆయన దేవతాసంతానం. జగదేక వీరులు శంతనప్రభువుల కన్నబిడ్డ. సామాన్య మానవు లాయన కెలా సమానం కాగలరయ్యా!

క : కాలేరు తాతగారూ! నేను కనులారా కన్నాను. ఆ యసమానయుద్ధకౌశలం, ఆ యనంతబలశౌర్యధైర్యాలు స్వయంగా చూచాను. చకితుడ నయ్యాను.

శం : అయితే, కల్యాణా! వీరదేవవ్రతుని సహచారివి. నీ వేమి చేశావయ్యా? చూడటంమాత్రమేనా, నీవూ యుద్ధాలు చేశావా?

దే : కల్యాణుడు వీరక్షత్రియుడు నాన్నగారూ! కుబుసం విడిచిన కోడెత్రాచు. అతిరథులనూ మహారథులనూ అనేకు లను జయించాడు. అండయై దండయై నా కనేకవిధాల సాయపడ్డాడు. నాకు సేవచేయటం యితనికి నిత్యకృత్యమై పోయింది. నే నెంతవద్దన్నా వినడు నాన్నగారూ!

అం : ఫరవాలేదు బాబూ! మీ స్నేహం అవిచ్ఛిన్నం. అగాధం. అభేద్యం. పరస్పరం సేవలు చేసుకోవటం స్నేహితులకు ధర్మమేనయ్యా!

దే: ఏమో తాతగారూ! ఈ కల్యాణుడు వచ్చి సంవత్సరం కావచ్చిందికదా. నన్నెన్నడూ విడువడు. ఈతడు ప్రక్కనుంటే నాకు బహిఃప్రపంచమే కనబడదు. ఈతని తెల్లకనులలో వెల్లివిరిసే ప్రఫుల్లప్రేమ, యీతని మనోహర సంభాషణలలోని మాధుర్యం, యీతని చల్లని సేవలలోని మహాసౌఖ్యం నాకు మైమరపు తెస్తుంటుందిస్వామీ!

శం: మంచిది నాన్నా! మంచిది. మీ రాదర్శ స్నేహితులు కావటం మా కానందం. సంతోషంగా సంచరించండి.

[ తెరలో అనేక జనుల జయజయ ధ్వనులు వినబడును. ]

అదిగో! దిగ్విజయోత్సవసంరంభం. పౌరు లిక్కడికే వచ్చేశారు....మీ కోసమే. ఇప్పటికే ఆలస్యమయింది... మీరు వెళ్ళండి నాన్నా!

దే: మంచిది నాన్నగారూ!

(నిష్క్రమించును)

క: అయ్యా! సెలవు.

అం: మంచిది బాబూ!

(కల్యాణుడు నిష్క్రమించును)

శం: ఉఁహుఁహుఁ ... తనువులు వేరుగాని వీళ్ళ తత్వాలొక్కటే స్వామీ!

అం: నిజమే ప్రభూ! దేవవ్రతులు శిలాకర్కశకాయులు. కల్యాణుడు శిరీషకుసుమకోమల శరీరుడు. ఆయన మహోన్నతమూర్తి. ఈతడు పొట్టి. వారిది వీరతేజస్సు. కల్యాణునిది సౌమ్యకళ. అంతే భేదం.... రెండూ రెండు జాతిరత్నాలు.

[ గౌరాంగుడు ప్రవేశించును ]

గౌ: కాదు ప్రధానిగారూ! ఆ యిద్దరూ చిలకాగోరువంక లనండి. మాలతీపున్నాగా లనండి. గోవృషభా లనండి.

శం: అదేం వర్ణన గౌరాంగా!

గౌ: అంతే మోహనాంగా! అంతే. ఈ కల్యాణుని జన్మలగ్నం వృషభం అయిఉంటుంది. లగ్నాధిపతికి పురుషగ్రహ సంయోగం స్వల్పం. స్త్రీగ్రహదృష్టి చేటుకాబోలు. అందుచేత అచ్చంగా ఆడుపిల్లగా అవతరించ దగ్గది కాస్తా మగపిల్లాడై మనలో పడ్డాడు. చూడండి,

పిరుదు లంటెడు నెరికురుల్, హరిణనేత్ర
యుగము, అంగరఖాకప్పు నొఅసి బిగిసి
దిమ్ము ఱొమ్మును, రాయంచతీరు నడక,
పూవు వంటిది మే, నివి పురుషకళలొ!

శం: అహ్హాహ్హా! మన గౌరాంగుడు కల్యాణుని కన్యను చేశాడు స్వామీ!

గా : నేను చేయలేదు మహారాజా! అతడే అలా గున్నాడు.

కోతి కోతియగును; కొండముచ్చే యగు
కొండముచ్చు; కోతి కొండముచ్చు
కొండముచ్చొకండు కోతి కాగలదొకో!
మారగలదె సృష్టితీరు భువిని?

శం : ఊఁ...అయితే.... నీదృష్టి కత డబల అన్న మాట.

గా : నాదృష్టికేకాదు ప్రభూ! రోగరూపితంగాని దృష్టితో చూస్తే యోగికన్నులకుకూడా కల్యాణుడు కన్యలాగే కనిపిస్తాడు. బాగా చూడండి.

అం : మా కలా కనిపించటంలేదు గౌరాంగా!

గా : మీకు కనిపించడులెండి స్వామీ! చెరువులో చిందులు త్రొక్కే చేపకంటికి తోచేది నీరే. కొబ్బరికాయలో నీళ్లకు కనబడేది గుంజే. అనుమానమే లేని అంశుమంతులవారి దృష్టికి కల్యాణుడు కన్యలా గెలాకనిపిస్తాడు?

అం : కల్యాణుడు ఎన్నో యుద్ధాలు చేశాడట గౌరాంగా! ఎందరో మహావీరులను చిందరవందర చేశాడట.

గా : చేస్తాడు చేస్తాడండీ! ఇంటివెనుక పెట్టమారి యెన్ని జెట్టిపుంజులను మట్టి గరపించలేదు? తాటకమ్మ యెందరు మహర్షుల గుండెల రక్తంతో గొంతు తడుపుకోలేదు? కృష్ణవేణమ్మచేతి కీలుబొమ్మగాని మగవా డెక్కడున్నాడు మహామంత్రిగారూ?

వృషభరాజు పెయ్యవెన్నంటి తారాడు ;
పెట్ట యున్నచోటు విడదు పుంజు ;
ఉవిదకొఱకు ప్రాణమొడ్డు మనుష్యుండు ;
దాసు డెవడుగాడు తరుణియెదుట ?

శం : ఉఁహుఁహుఁ. పోనీ.... గౌరాంగా ! నీ మాటే నిజ మనుకోగాని కల్యాణ దేవవ్రతుల స్నేహం యెంత చక్కనిదో చూచావటయ్యా !

గౌ : ఓహో ! చాలా చిత్రమైనది ప్రభూ ! ఆ ప్రేమ తారాజువ్వలా ఆకాశాన్ని తల దన్నింది. దేవపానీయంలా నాభికంటే తియ్యగా పోతున్నది. మింటిమీది ప్రొద్దులా మిరుమిట్లు గొలుపుతున్నది. చిత్రమైనదే వాళ్ల స్నేహం. దాని కేంగాని...ప్రభూ ! తమ రింకా యిక్కడున్నా రేం ? దక్షిణదిగ్విజయయాత్రామహోత్సవంలో పట్టణమంతా ధ్వనిల్లిపోతున్నది. వేడుకగా చూచివద్దాం. కాస్సేపలా దయచెయ్యండి మహారాజా !

అం : ప్రభువువారు సాయంకాలం వస్తామన్నారు గౌరాంగా.

గౌ : అవు నవును ప్రధానిగారూ ! రాజావారి రాకకు లాంఛనాలు కావాలిగా మరి ?...నిజమే స్వామీ ! భరతనాట్యం చెయ్యబోయే పడుచుకత్తెకీ, దూరదేశాలు యుద్ధానికి పోయే వీరసైనికుడూ, మహత్తర ధ్వనులు పలుకబోయే మద్దెలా, పృథ్వీనేతే పెద్దమనుష్యులూ, అందరిలా అవతలికి రాగూడదులెండి స్వామీ ! తమరూ రాజావారూ తరువాత దయచెయ్యండి. నేనుమాత్రం పోతున్నాను.

ం : నీవూ మాతో వత్తువులే గౌరాంగా !

గౌ : కొమ్ముటేనుగులతో కుందేలా స్వామీ !

ం : నీవు తక్కువవాడవా గౌరాంగా ! విదూషకచక్రవర్తివి. చక్రవర్తుల ఆస్థానంలో ముఖ్యసభ్యుడివి. ఝుంఝామారుతాన్ని మించిన స్వైరవిహారివి. నీకేమయ్యా !

గౌ : అన్నీ ఉన్నాయి ప్రధానిగారూ ! అన్నిటితోపాటు గుండెల్లో అదుటుకూడా ఉన్నదండీ. అన్నివేళలా అధిపులతో ఆటలాడకు అంటుందండీ అది.

ం : ప్రభువులవద్దకూడా నీకు భయంలేదుగాదటయ్యా !

గౌ : భయంలేదుగాని బరువు స్వామీ !

మిత్రుడైనను మధ్యాహ్నమిహిరకాంతి
మేల్మిమైనను మోతకుమీరు డబ్బు
కమ్మగానున్న యేబదికన్న గారె
లెంతవారైన భరియింతురే మహాత్మ !

ఎండుటాకులా తేలిగ్గా నన్నెగిరిపోనివ్వండి స్వామీ ! హాస్యగానికి ఆదరాలూ మర్యాదలూ అక్కఱలేదు. అతడు చిన్న అబ్బాయి. చీకూ చింతా లేనివాడు. అన్ని వినోదాలకూ ముందే హాజరవుతాడు. పంక్తిభోజనాల్లో వానిదే మొదటి విస్తరి. నేను ముందు పోతాను. సెలవు మహారాజా !

( నిష్క్రమించును )

అం : ఉఁ హుఁ హుఁ !

శం : విదూషకుడు వెళ్లిపోతే వెలవెలబోతుంది స్వామీ !

అం : నిజమే ప్రభూ ! గౌరాంగు డొక్కడూ కావలసినన్ని మేళతాళాలు.

శం : అయితే...అతని హాస్యం చాలా అర్థయుక్తం మంత్రిగారూ ! కానివేళల్లో వాని విమర్శ కటువే కావచ్చు. కాని అది సత్యానికి సమీపం. అందుచేతే హాయిగా స్వీకరిస్తుంటాం అతని హాస్యాలు. అతనికి హెచ్చులొచ్చులు లేవు. వరుసవాయిలు లేవు. మంచిచెడ్డలు లేవు. సమయాసమయాలు లేవు. సూర్యరస్మిలా అందరిపైనా సమానంగా స్వారి చేస్తాడు....గౌరాంగుడు మాకు చక్కని కాలక్షేపం. అందుకే తీరిక వేళల్లో అతన్ని తీసుకుపోతుంటాం.

అం : రేపటి మృగయావినోదానికికూడా సిద్ధమవుతున్నాడు ప్రభూ !

శం : అతడు తప్పక రావాలి. గౌరాంగుడు వేటాడడు కాని చోద్యంగా చూస్తాడు. అందరినీ నవ్విస్తాడు. శ్రమ తోచనివ్వడు. అత డుండితీరాలి. తప్పక రమ్మని చెప్పండి. మరి .... మరి .... వేటకు ప్రయత్నాలన్నీ చేయించండి. యమునానదీసమీపారణ్యాల్లో కోయ కొండరెడ్డి చెంచు సేనలకు ముందే కబుర్లుచేయించండి. ఇప్పటినుంచీ ఆ సన్నాహాలు చెయ్యండి. రండి.

( నిష్క్రమించును )

అం : చిత్తం.

( రాజువెనుక నిష్క్రమించును )

( తెర పడును )

## 2-వ రంగము

## యమునా నది

[ గడకఱ్ఱ చేతగొని దాశరాజు, ప్రక్కన మాతంగి నిలచి యుందురు. ఆ ప్రక్క యీ ప్రక్క చూచుచుందురు. ]

మా : ఎక్కడా కామట్టంలేదయ్యా! ఇంకా రాటంలేదేటో మరి.

దా : ఏఁవి సెపుమా ! బారిడు పొద్దుమీరిపోయిందే !

మా : మరే....సద్దికూడు తినేసి సక్కొత్తానంది. ఇంత జాగెందుకో !....అయినాగాని...దొరా ! మన సత్తోతికి బాగా జాగయ్యా ! పందుము ల్లయిపోయేదాకా పళ్లు తోఁవుద్ది. దువ్వా నరిగీదాకా తల దువ్వుద్ది. బుఱ్ఱ బరువెక్కీదాకా పువ్వులు ముడుత్తుది. బొట్టెట్టుకోటం పూట. కాటికెట్టుకోటం గడియి....మరి...మరి....సిన్ని లొన్నిలు తీరిసి సీరి సింగారింతది. సిత్రాసనంమీద కూకుంటది. జెపం జెపం జెపం. ఆ తరవాత బువ్వ. బువ్వెంతలే ? గువ్వపిట్టలాగు రొండు గుటకలేగా !

దా : ఉఁ హుఁ హుఁ .... సత్తోతంటే యేటనుకున్నావే మరి మాతింగీ ! నీ యంటిదీ నా యంటిదీ నంటే ? ఆ పుట్టకే యేరే. మనింట పుట్టాల్చిందంటే ?

మా : ఎవళ్లింట పుట్టాల్చిందేంటి ?

దా : ఎక్కడో పెద్ద పెద్ద సెత్రీలింట పుట్టాల్చిందే. లచ్చాధికార్లింట రాణోసం జెయాల్సిందే. ఆ వొంగడం యెలాంటిదే మరి ?

మొవ్వలాంటి వోల్లు ; ముత్తేలుగా పళ్లు ;
కలవరేకు కళ్లు ; మొలకనవ్వు ;
సిరిగలట్టి మొకము ; సిన్నారిమాటలు ;
సత్తివమ్మ గొప్ప జాతిబొమ్మ. ॥

మా : నిజఁవే దొరా ! మనగ్గికులంరాజుల్లో అంతందగత్తి ఆపల్లేదు.

దా : ఒవేస్ ! బురదగుంటల్లో బురబుర్లాడీ అగ్గికులఁవే ఆపడిందంచే నీకు ? గొప్ప కులపోళ్లని సేనమందిని సూశానే నేను. పట్టాల్లో సూశాను. పల్లిల్లో సూశాను. బెవనాల్లో సూశాను. పెంకుటిళ్లలో సూశాను. సత్తోతమ్మంటి సక్కని సుక్క యీ బూపెపంచికింమీ దెన్ని వల్లేసి దేవినా గామల్లే దనుకో. మన సత్తోతి...సూశా...అందానికి రంబే. బుద్దికి బూలచ్చిఁవే. కళ్లకి కల్లేణవేఁ.

మా : మనకళ్లకి కల్లేణవేఁ. దానికిమాత్రం నువ్వు కల్లేణం సెయ్యవుగా ? పదిమీ దెనిమిదేళ్లు పైనడ్డయ్యి. వోయి సొచ్చేసింది. పెళ్లి సేసేద్దాఁవయ్యా అని కోడై కూత్తున్నానే, సెవు నేసుకుంటున్నావంటయ్యా నువ్వు ?

దా : ...ఉఁహుఁహుఁ.....కల్లేణం గడీలు కల్చిరావాలే మాతింగీ ! ఆత్రంపడితే అవదే.

రేత్తిరై పోతెగంద సూరీడువొచ్చు ?
పరువు కొత్తేనుగద సేను పంటకొచ్చు ?
సెరువునీ రెండితేగంద సేపతేటు ?
ఆ గడియి లొచ్చితేగంద అమ్మపెళ్లి ? ॥

...ఆనాడు జనకమారాజుగారెంత తొందరసేశారే? సీతమ్మోరు పెళ్లి సీగ్రంగా సెయ్యగలిగేరంటే? ఆ మూర్తం వొచ్చినేల కేఁవయిందే? రానే వొచ్చారు రాఁవులోరు. సేతబట్టేరు శివుడిల్లు. బడీలుమని బద్దలయిం దది. సీతమ్మ పెళ్లైపోయింది. ఇంతే గాదంటే?

మా : యేటోలేవయ్యా నీ యేదాంతం? నాకు తలమంట. పిల్ల పెళ్లన్నప్పుడల్లా యేటో పెద్ద యేదాంతం యేకరు వెడతావు. నే నెలాసావనయ్యా నీతోను? ఈడొచ్చిన పిల్లకి జోడులేకపోతే యెం తీనాయిఁవయ్యా నలుగుర్లోనూ? అమ్మలక్కలందరూ న న్నాడిపోసుకుంటున్నారు. నీకేం?

దా : ఉఁహుఁహుఁ...తొందరడకే లచ్చిఁవీ!

మా : యెంతకాలఁవని యిలా గోరుసుకోమంటావు? నే నెంత సింతించినా నీకు సీఁవ కుట్టదయ్యానే!

దా : నాకుమాత్తరం లేదంటే సిట్టితల్లి పెళ్లి సేదాఁవని? పైకి బాఁవురుమంటావు నువ్వు, గుండిల్లో గుంపి జెంపీ లాడతాన్నేను. ఎగాదిగా నే నెం తాలోయింతున్నానే! అమ్మకి తగ్గోరు డాపట్టం లేదే నా కంటికి.

మా : సింగినాదం! ఇంత బూఁవేల్తున్న దొరవి. దాసిదొర సరింగా తల్చుకుంటే కొండమీద కోతి దిగిరాకపోనే టీపాటికి?

దా : కాదే మాతింగీ! ఎన్నో యెతికింతున్నానే. యెక్కడా ....యెక్కడా గనమల్లేదే కంటి కానొడు.

మా : ఊఁ...ఎక్కడా దిక్కుమాలిపోతే యేంజేత్తాంవేంటి? ఉన్నాట్టో మంచి సేపని జూసి ఉప్పు నేసుకోవాలి మరి. అంతే.

దా : తప్పు తప్పే మాతింగీ! ఉన్నోళ్లందరూ ఉత్త చన్నాసులేనే. జోడుగాని పెళ్లి సొడ్డే! సూశావంటే మాతింగీ!

అందఁవైన రాయి కతియెలు గుండాలి ;
మనిసికుండవోలి మంచి గుణవు ;
మంచి పువ్వులోను మహావాస నుండాలి ;
కాకపోతె జోడు కలుసునంటె ? ॥

ఆరోజుని పరాశిరజాగోతులు మనింటికొచ్చి యేం జెప్పేరే? ఓయి దాశరాజూ! అన్నారు. సత్తోతి అదుట్టం సాలా గొప్పదన్నారు. సెంద్రొంశింలో రాజుని పెళ్లి సేసుకుంటదన్నారు. మారాణవుద్దన్నారు. కంద్రించి సెప్పేరు కాదంటే? సత్తెమ్మ సెరీశంమీ దోసన ఓజినం దూరం కొడతది అరిచ్చి నొరంతోనే గాదంటే? మాత్ములు మాటలింతట్టోకే మరిసిపోయావంటే మాతింగీ! ?

మా : సెప్పేరు సెప్పేరులేయ్యా! అందంగున్న పిల్లగందా అని ఆలాదంగా అనేశా రేదో. ఆ మాటే మట్టుకు నేలాడతావేంటి? పల్లీలుం మనఁ వెక్కడ? పట్టపురాణెక్కడ? పెబువు సత్తోతికి పెళ్లికొడుకౌతాడా? అనీ మాట కర్దం వొద్దేంటి? యింత పెద్ద కొండని యెంటుకేక్కలాడగడతావా? సాలు సాల్లే. యీ పిచ్చి బెవలొదులింక.

: అమ్మమ్మమ్మా ! అలా గనకే మాతింగీ ! అపరాదఁవే. దవళ్లేసుకోయే. రుసీసులు మాటంటే యీసిరాయిదెబ్బనే. ఆరు నూరైనా అయితీరద్దే. నా కదే నమ్మకఁవే.

మా : ఊఁ ... యెప్పు డిన్నావేంటి నా మాట ? నీగోలే నీదిగా ?...అదుగో, వొత్తుంది సత్తోతి.

దా : వొత్తుం దొత్తుందే....సూడవే మాతింగీ! ఆ నడక సూడే, నెఁవిలిపిట్టే. పట్టం యేనుగే.

మా : నడకసరి. ఆ తుమ్మెదల్ని తోల్తదేం టలాగు ?

దా : ఆడుకుంటదే ఆటల్తోను.

మా : ఆశే...ఆశే అది. యేటో యీ ఆటాలు! తుమ్మెదల్ని తోలుకోటం వొకాట, కోయిలమ్మతో కోకో అనటం వొకాట, నెఁవిలిపిట్టలికి నాట్టింనేరపటం వొకాట, జింక పిల్లల్తో సిరిగంతులెయ్యటం వొకాట, సెలేటి నీళ్లల్లో సిందు లాట్టం వొకాట, నదిలో నావతోత్తం వొకాట...సిత్రం గుంటాయి దొరా! దీని సిన్నతనంసేట్టలు.

దా : ఉఁహుఁహుఁ .... అన్నీ సెక్కరార్తుల సేట్టలేనే...ఆ మాట, ఆ పాట, ఆ సదుఁవు .... సూశా ! సుబ్బంబొట్లుగారి సుందరమ్మగారికంటే సోకైన వాకు గాదంటే ?

మా : అయ్యోర్ని కుదిరిసి అన్నిద్దిలూ సెప్పించావుగా మరి?

దా : సెప్పించాం. సెప్పించాం. అన్నిద్దిలూ ఆకళింపేనే అమ్మకి...అయితేనేం? కులం ప నొదులుకోనంటది. ఈ రేవు నావ నడపటం మానదు...పొత్తకాలు ముందేసుకుని సదుంకోక అమ్మ కీ పుర్రాకులెందుకు సెప్పే ?

మా : సంతోసంగా సేసీ పని సాగిపోనీలేవయ్యా ! ...
సక్కంగా నడుపుద్ది పడవ.

దా : మనందరికంటే మంచిగా నడుపుద్దే. ఎంత తెలివి ! ఎంతసురుకు ! ఎంతబద్రం ! వొట్టిబీదోళ్లని వొట్టిదానికే వొదిలేత్తదే.

మా : బీదోళ్లంటే యెంత పేవో !

( తెరలో )

బాబా ! అమ్మా ! బాబా !

యెందుకో పిలుత్తుంది మనన్ని. ఏటే? యెందుకే ?

దా : యేటమ్మా అది ?

( తెరలో )

లేడిపిల్లలు బాబా ! రెండు పిల్లలు. రండి బాబా ! చూడండి. రండి.

మా : లేడీనిండి కామోసు. పిల్లలున్నయ్యిగా మోసు తోవలో. సోద్దెం సూత్తా కూకుంది మల్లీని. ఇదేం యింతోలమ్మా !

( తెరలో )

త్వరగా రండి బాబా ! అమ్మా ! అమ్మా !

దా : రాయే. రాయే. మనం సూద్దాం రాయే.

( మాతంగి చెయ్యి పట్టికొని లాగును )

(ఇరువురూ నిష్క్రమింతురు)

( తెరపడును )

# ద్వితీయాంకము

## 1-వ రంగము

## యమునానది రేవు

( శంతనమహారాజు, గౌరాంగుడు ప్రవేశింతురు )

శం: సైనికులారా! విటయులారా! మీరు వేటలో చాలా శ్రమపడ్డారు. ఈనాడు షడ్రసోపేతంగా వంటలు చేసికొన్నారు. భోజనాలు చేశారు. వేడివేళ గుడారాల్లో విశ్రమించండి. చల్లబడినంతనే తరలిపోండి. రేవు జాగ్రత్తగా దాటండి.

గౌ: రేవు దాటండి. రేవులో దిగకండి. మీరు రేవులో దిగేరంటే యిళ్లదగ్గర మ్రింగటానికి మెతుకు లుండవుమరి.

శం: అదేమిటి విదూషకా!

గౌ: ఏమున్నది పాలకా!

భిక్షమెత్తియో కన్నాలు వేసియో ని
జారిజన భాగ్యలక్ష్ములు చూఱగొనియొ
పురుషు డింటిని బోషించు; పురుషహీన
గతి గలుగు నింటికిన్ మ్రింగ మెతుకు గలదె? ॥

మహారాజా! గౌరాంగుని మాట వేటకత్తితో పోటు సుమండీ.

> భార్య చనిన యతడు పైత్య మ్మధికమైన
> వాడు కోపగించువాడు రేవు
> దిగుట సంభవించు తీరక; నాలాటి
> గతులు వీరి కేల? కర్మమొక్కొ?॥

శం: నీలాటి గతి అంటావు. నీ కేమి దుర్గతివచ్చింది గౌరాంగా?

గౌ: సందులూ గొందులూ మీకు తెలియవు సార్వభౌమా! అవును...నాకూ యిది దుర్గతే. దుర్గతే కాదు. దురంతకపు గతి.

శం: ఏమి?

గౌ: ఇంకేమి కావాలి ప్రభూ!

> మచ్చునకేని యెట్టి యను
> మానములేని ద్విజాన్వయుండ నే;
> నచ్చట యజ్ఞవేదికల
> యందున వేదము వల్లెవేయుచుం
> బుచ్చగదగ్గ కాల మిది;
> పుణ్యమొకో మృగయార్థ మీగతిన్
> వచ్చితి నీదువెంట; నిక
> బ్రాహ్మణధర్మము గంగపాల్గదా?॥

నారాయణ! నారాయణ! ఇన్ని వేల మృగాల శరీరాలు చీలుస్తుంటే కళ్లారా కంటున్నానుగదా! మైలశవాల మధ్య మసులుతున్నానుగదా? మృగమాంసతోరణాలు

వ్రేలాడే మిద్దెలక్రింద మీతోపాటు నిద్రిస్తున్నానుగదా? నస్యంతోపాటు నానావాసనలూ నా ముక్కులో కెక్కి-పోతున్నాయిగదా? నోరుమాత్రమేకదా కట్టుకొన్నాను? ...నా కిది నిజంగా గతజన్మదుష్కర్మఫలమేకావాలి మహారాజా!

శం: నిజమే గౌరాంగా!...పాపం! పవిత్రమైన బ్రాహ్మణుడవు. క్షత్రియాన్వయ సహవాస సంచారాలు నీకు తగవేమో...నీవు...నీవు...ఈ ఉద్యోగం విడిచికో.

గౌ: ఏంబాబూ!? మ్రింగటానికి మెతుకుల్లేక రంగున చావటానికా?

శం: కాదు కాదు గౌరాంగా! నీకిప్పు డిచ్చే వేతనానికి రెట్టింపు నీకు పంపిస్తాం. నీవు హాయిగా యింటివద్ద నిలచి సదాచార సంపన్నజీవనం చెయ్యవయ్యా!

గౌ: లేదయ్యా బాబూ! ఆ యోగం నాకీ యుగంలో లేదిక.

నౌకరీ జేసి జీవించు నరపశునకు
అదిచెడిన జీవనోపాధి యెది మరొండు?
పరువు సెడిపోయి యక్షయపాత్ర కేని
చేతగాని పెయ్యమ యగు నాత డపుడు.?

శం: అయితే నీ విప్పు డుభయానికీ చెడిపోయా వన్నమాట?

గౌ: అన్నమాటే కాదు. ఉన్నమాటే అది. భార్యతో సౌఖ్యమూ పరిపూర్తి కాలేదు. బ్రహ్మచర్యవ్రతమూ పట్టుపడలేదు. వేదవేందాంగవిదుణ్ణి కాకపోయాను. విద్యాశూన్యుడైన వెట్టివెంగళప్పనూ కాలేకపోయాను. ఛాందసా

చారిని గాకపోయాను. అన్నిమైలలూ ఆపోసనబట్టే అఘోరీముండాకొడుకునూ గాకపోయాను .... ఉభయ భ్రష్ఠం ఉపరి సన్యాసమూను.

శం : ఈనాడు నీకీ కాక యేమిటి గౌరాంగా !?

గౌ : కలి కలి లాడే కడుపు కేదీ పడనప్పుడు కాక గాక కల్యాణమా సుందరాంగా !? మీకేమి ! అందరూ హాయిగా భుజించారు. ఆట లెన్నైనా ఆడతారు. పొట్ట భుగభుగ లాడుతున్నది నాకు. వంటజేసికొని రెండు మెతుకులు తంటాలుపడతాను. మీరు వెళ్లండి బాబూ !

( నిష్క్రమించును )

శం : ఉః హుః హుః ... ఆకలిమంటల్లోకూడా యితని మాటలు హాస్యవచనాలే...ఈతడు రూపమెత్తిన హాస్యం గాబోలు.

( తెరలో )

కమ్మతేనెలు త్రావి మైకమ్ము గ్రమ్మి
పరవశత్వమ్ముతో మేను మరచి స్వైర
మధురగానమ్ము సేయు షట్పదములార !
మీదు గీతమ్ములకు నర్థ మేది యగునో ? ॥

శం : ఆహాహా ! ఆ మధురగాన మెవరిది ? .... వీణాగానమే. అది కిన్నెరస్వరమే. కమ్మని పిల్లగాలిలో కలిసి నదీమధ్యంనుంచి వస్తున్నది. గానంమాత్రమే కాదు. జాజి జవ్వాజులను మించిన పరిమళం ప్రస్ఫుటంగా

వస్తున్నది. అక్కడినుంచే. ఓహో! అందు ఎవ్వరో కన్య నావ నడిపించుకొని వస్తున్నది. ఓహోహో! ఈ అసమానసౌందర్యం యెక్కడిది? ఈ నూతన శృంగార రూపసి యెవరు?

ఈ యందమ్ముల చందమామ యెవరో?
యే దేవతాకన్యయో!
మాయా మోహినియో! మహాప్రణయసా
మ్రాజ్యమ్ము పాలింపగా
యీ యిందీవరనేత్ర రూపమున ని
ల్లోతెంచె సౌందర్యమో!
ప్రాయమ్మీ కళ యీ మనోజ్ఞలతికా
లావణ్య మేమందుమో! ॥

అంతిపురులలో మహాదివ్యసుఖముల
దేలదగ్గ నవ్యదివ్యమూర్తి
క్రోవిదండ మందికొని యెక్కతే నావ
గడుపుచున్న; దేటి కర్మ మగునో? ॥

మళ్లా గంగాదేవి యీ రూపున కనిపించటం లేదుకదా! కాకపోతే....యీమె కనిపించినప్పటినుంచీ మనసు మథన పడుతున్నదేమి? ఇది వలపా? గంగ విడిచిపోయిన నాటినుండి పదునెనిమిదేళ్లు బ్రహ్మచర్యదీక్షలో నున్న నా కీనాడు మరల వలపుతలపులు ప్రభవిస్తున్నవేమి? శంతనుని హృదయం ధర్మమార్గం తప్పనిదే....ఈ నవ్య భావాలు న్యాయదూరం కావుగదా?

(తెరలో)

ఇపటి యభిజిన్ముహూర్తరాజేంద్రమౌళి
మనదు మధ్యాహ్నమార్తండ మహితదైవ
తమ్ము ప్రేమమ్ముమై దర్శనమ్ము నిచ్చె;
రండు పూజించుకొందము రమణులార!

(క్రోవిదండముతో మోకాలివరకెగగట్టిన చీరతో సత్యవతి ప్రవేశించును.)

ఏది? ఏది? ఆ గీతం యింకొకసారి చదువు.

(సత్యవతి శంతనునివంక సిగ్గు సిగ్గుగా చూచును.)

నిన్నే చిన్నదానా! మధురంగా మంజులంగా మనోహరంగా ఉన్నది నీ గొంతు. రవిరాజుతో రారాజును గలిపి నీవు చేసిన వర్ణన మాకు కర్ణరసాయనంగా ఉన్నది. ఇంకొక్కమారను. ఉత్సాహంతో వెల్లుబికిన మధురగానప్రవాహం మధ్యలో ఆపకు. ఆ మహాదమృతం....మరొక్కమారు.....

స: నేను చదివికోలేదు ప్రభూ!?

శం: నీవు చదువుకోలేదంటే మేము నమ్ముతామా? అపర సరస్వతివి. జ్ఞానశరచ్చంద్రికలు జల్లులు కురిసే నీ ముఖం చెబుతున్నది. నీవు చక్కగా చదువుకొన్నావు...ఏది! ఆ మధురగానం ... యింకొక్కమారు .... ఏది!

స: నాకు గానకళకూడానా ప్రభూ!?

శం: ఉఁ హుఁ హుఁ....స రి గ మ అంటేనే సంగీతంకాదు చిన్నదానా! మనసును రజింపజేయగల మధురసౌరభ్యం

యేగానంలో ఉన్నదో అదే నిజమైనగానం. కలకంఠివి. నీ వేమన్నా గానమే...ఏది ... ఏది ... ఆ గీతం....పాడు.

(సత్యవతి పై పద్యము పాడును)

ఓహోహో! మోహినులకే సమ్మోహనాస్త్రం గాగల ముగ్ధముఖసరోజం. సన్నజాజి సువాసనలతో నాసలకు సంతర్పణచేసే కుసుమకోమలశరీరం. కమ్మని గంధర్వ గానం. నీవు....నీవు....స్త్రీజాతికే శిరోమణివి. మహారాణివై మన్నన లందదగ్గ మహితలక్షణవతివి...పాపం! ఏమిటో యీ ఘటన! పాపం! రత్నహారం తోలుతొడుగులో మణిగిపోయింది....ఏమిటో!

స: ఏమిటది ప్రభూ?

శం: అదే చిన్నదానా! లక్ష్మీదేవి పూరింట నివసిస్తున్నది. విశ్వేశ్వరి కపాలపుపళ్లెంలో విందారగిస్తున్నది. ఎందుకో పాపం!

స: మీ మాటలు నాకర్థం కాలేదు ప్రభూ!

శం: ఉఁహుఁహుఁ....నీకేకాదు, మాకూ అర్థం కావటంలేదు.... ఏ రారాజముఖసరోజాలకో రక్షకపత్రం గాదగ్గ నీ అరుణ పల్లవహస్తాలకు తగినది క్రోవిదండమా? కస్తూరి ముత్యాల కళల్తో కనకభూషణ ధగద్ధగాయమానకాంతులతో నిలువు టద్దాలలో కలకల వెలుగదగిన నీ ముద్దుల మోము చందమామ ప్రచండసూర్యరశ్మిలో పసలు వాడిపోవల సిందా?....కోమలీ! నీ పసిడివిగ్రహాని కా మోకాలు మూయని మోటుచీరా? రంగారు శృంగారవతివి, నీ కీ కఠినవృత్తి కెలా పాలైనావు సుందరీ!?

స: నా కిది కఠినకృత్యంగాదు ప్రభూ! చిరపరిచితం. సంతోష దాయకం.

శం: కాదు చిన్నదానా! నీ కిది కఠినాతికఠినం.

స: మీ నవనీతహృదయాని కలాగున్నదేమో ప్రభూ!

శం: అవును. నీ దుస్థితి చూస్తుంటే నా దుర్బలహృదయం నవనీతంలాగే కరగిపోతున్నదిసుమా.

స: నేను పల్లెపడుచునుగదా ప్రభూ!

శం: కాదు చిన్నదానా! నీవు కైవర్తాంగనవు కావు.

కానిదొ యైనదో యెదియొ
కారణ ముండకపోదు నీ చరి
త్రానికి నిట్టి నిష్ఠుర వి
ధానము వట్టగ; నీదు రూపు రే
ఖానుతలక్షణాలకును
గట్టిడి పల్లెకులాని కేటి సం
ధానము? క్షత్రియాంగనవు
తప్పక యోజనపద్మగంధిరో! ॥

కల్యాణీ! కన్నులతో నీ కఠినస్థితి కన్నదాది యమున దాటి అవతలికి పోలేకపోతున్నాముసుమా.

స: తమ రిప్పు డెక్కడికి పోవాలి ప్రభూ!?

శం: ఈ యమున దాటి హస్తినాపురికి పోవాలి.

స: అయితే....తమరు.... ? తమను.... ?

శం: హస్తినాపురసార్వభౌములం, భరతవంశజులం. శంతన రాజంటారు మమ్మల్ని.

స : ఓహో ! నమస్కారం ప్రభూ ! నమస్కారం .... నావ యెక్కండి. అవతలికి దాటిస్తాను.

శం : వద్దు చిన్నదానా !

తెమ్మెటు క్రోవి నాకు యువ
తీమణి ! ని న్నొకచేత మన్మహో
రమ్మన కొత్తిపట్టి విపు
లమ్మగు నీ యమునాప్రవాహ నీ
రమ్ముల కంటకుండ నతి
లాఘవమొప్పగ గంతువైచి యొ
క్కుమ్మడి జేర్తు నద్దరి మ
హోర్జిత సత్వమహత్వ మేర్పడన్.

(సత్యవతిని సమీపించును.)

స : ఊఁహుఁహుఁ

(సత్యవతి తలవంచి దూరము తొలగి నిలచును)

శం : ఏం సుందరీ! తొలగిపోతావేమి ?

స : అవును ప్రభూ !...నాకు...ఏదో...భయంగా...

శం : నీకు భయమా ? మేము నిన్ను ప్రేమతో చూస్తున్నాము. ప్రేమతో మాట్లాడుతున్నాము. ప్రేమతో నడుస్తున్నాము. నీకు కలుగవలిసింది భయంకాదు సుందరీ !...భక్తి ...ప్రేమ. భయమెందుకు ?...కాదు కాదు...ఇప్పుడు నీలో కనబడుతున్నది భయంగాదు...అది ప్రేమ...అనంతప్రేమ

యిప్పుడు నీలో అవతరించింది....అదుగో....అదుగో....
నీలోని భావాలే నీ ప్రేమను చెబుతున్నవి.

మూర్తీభవించెను ముమ్మరమ్ముగ మురి
పెమ్మదే ముద్దుమొగమ్ముపైన
మెరసె నందమ్ముగా సరిక్రొత్తకళలు మో
హనములై యా వాలుగనులలోన
పొడసూపె నింపుగా బుడిబుడి నునుసిగ్గు
పొంగారు రంగారు బుగ్గలందు
చిరునాట్యములు జేసె జిలిబిలి చిరునవ్వు
కమ్మని బింబాధరమ్ముచెంత

పోటు చనుగవ్వ మరిమరి పొంగి యుబికె ;
మృదువుగా సింహమధ్యమ్ము కదలియాడె ;
పసిమి మించి శరీరమ్ము పసలువారె ;
వలపు పొంగులు నీలోన తొలకరించె.

స : ఉఁ హుఁ హుఁ....

శం : ఏం చిన్నదానా ! మళ్లా నవ్వుతావేం ? నా పలుకులు బాగుండలేదా ?

స : బాగుండకేం ప్రభూ ! రాజరాజేంద్రులు. తమరేమంటే బాగుండదు ? ఏమన్నా అనగలరు. ఏమైనా చేయగలరు.

శం : కాదు చిన్నదానా ! శంతనమహారాజావారసత్య మాడరు. అక్రమం చేయరు.

స : అని అనేకనోళ్ల విన్నాను ప్రభూ !....కాని....కాని...

ం : కాని.... ఏమిటది చిన్నదానా ? నీవు విన్నదాని కిప్పుడు వ్యతిరేకం జరిగినదా ?

: వ్యతిరేకమో మరేమో ప్రభూ !

అబల నొకర్తునుంటి జవ
రాలిని యీ యమునాతటమ్మునన్ ;
సబలురు మీరు ; రాజకుల
చంద్రులు ; మామకయౌవనమ్ము నా
సొబగు ననేకరూపముల
సుద్దులు పాడిరి యేమొ యేమొ ; యీ
సబవు జనాధినాథులకు
సవ్యమొ ? మానినులందు నర్హమో ? ॥

ం : ఓహో ! ....ఏమో సుందరీ ! నిన్ను చూడటంతోనే పుట్టిన భావాలు పొంతలేకుండా వెల్లబోసికొన్నాము. తప్పొప్పులు తలంచికోలేదు. నీ వేమనుకొన్నా సరే.

స : అంతే ప్రభూ ! లోకం తీరే అది.

జవ్వని కంట గన్పడిన
చాలును ; మీ మగవారు పువ్వులున్
నవ్వులు గ్రుమ్మరించెదరు ;
నాట్యమొనర్తురు ; గీతలేటివో
దవ్వుల నాలపింతురు ; సు
ధల్ మొలిపించి నుతింతు ; రంగముల్
నొవ్వగ దృష్టిసేయుదురు ;
నూతనమా యివి మాకు భూవరా ! ॥

శం: ఊఁ. అయితే మమ్ముల్లనుకూడా ఆతతాయుల శ్రేణిలో చేర్చావన్నమాట.

స: క్షమించాలి ప్రభూ! అది మీ పొరపాటు కాదు. మా స్త్రీల లోకువ.

శం: అంత నిష్ఠురంగా ఆలోచించకు చిన్నదానా! మేము స్త్రీని దేవతగా పరిగణిస్తాం. మా చరిత్ర నీ వెరుగవు.

స: విన్నాను ప్రభూ! విన్నాను. మీ కన్న కుమారుల నేడుగురిని యేటగలిపింది మీ భార్య. అందుకు సహించారు తమ రామెయందలి అనురాగముతో.

శం: అవునవును.... కాని.... కాని....

స: కాని అష్టమపుత్రుని దక్కించుకోడాని కామె చర్య సహించమన్నారు తమ రాఖరికి. తన కిచ్చిన మాట తప్పి నందు కామె మిమ్ముల్లను మన్నించలేకపోయింది. విడనాడి వెడలిపోయింది.

శం: నిజమే. దానిలోనైనా మా తప్పేమిటి చిన్నదానా?

స: ఎవరి తప్పూ లేదు ప్రభూ! తమరు పుత్రుని దక్కించు కొన్నారు. ఆమె తన యథాస్థానం చేరికొన్నది.

శం: చేరికొన్నది .... చేరికొన్నది. మమ్ముల్లను చింతా సాగరంలో ముంచి పోయింది. ఇప్పటికి పదునెనిమిదేం డ్లైపోయింది ... భార్యావియోగం యెంతకష్టం! ఎంత సంతాపకరం చిన్నదానా?

గంగ త్యజించిపోవుట ప్ర
గాఢవిషాదము గూర్చె మాకు; నా

బెంగకు క్రుంగిపోతిమి; వి
 భిన్న మనస్కుల మైతి; మైన ని
స్సంగుల మై చరించితి మ
 జస్రము నింతకు బ్రహ్మచర్య దీ
క్షం గొని; గార్హపత్యసుఖ
 కాముల కీ వ్రతముల్ సులభ్యమో? ॥

స: కాదుప్రభూ! సార్వభౌముల ఏకనారీవ్రతదీక్ష ఈరేడు లోకాలా పేరు మోసింది.

శం: అవును ....ఇంతవరకూ అంతే ....కాని.... యిక ....కాని ....యిక ....

స: ఏమది ప్రభూ!?

శం: ఇంతటినుండి....మా ఏకపత్నీవ్రతం .... గతించినట్లున్నది సుందరీ!

స: ఏమిప్రభూ!?

శం: చెప్పుదునా? .... పరార్థం .... నీవు పరార్థం చేసికోవు కదా?

స: ప్రభువచనాలకు పరార్థమా ప్రభూ!

శం: ఇప్పుడు మేము ప్రభువులమై పలకటంలేదు చిన్నదానా! అర్థులమై యాచిస్తున్నాము. ప్రేమికులమై వివరిస్తున్నాము. గృహస్థజీవనానికి మరలా మార్గం చూపుతావని అనుకొంటున్నాము.

స: ప్రభూ...!

శం: ఆశ్చర్యపడకు సుందరీ!

తీయనిబాధ మించె భవ
దీయముఖాంబుజదర్శనాది యే
మో యువతీ! మనోజుడు మ
ముం గురిజేసె నిజప్రసూనశ
స్త్రీయతతీక్ష్ణధారలకు;
నన్యము తోచదు నీవుతక్క; నీ
ప్రాయము మాదు సొమ్మగు ను
పాయము యోచనజేతు మెంతయున్.॥

స: నేను.... నేను కన్యను ప్రభూ!

శం: మ మ్మన్యథా తలంపకు రమణీ! నీ కన్యాత్వానికి కాని పని చేయం.

సుమశరుబాధ కోరువని
చొప్పులు గా వివి; నీకు గాత సే
యు మనసుగాదు; మోహజని
తోక్తులుగావు; మదాత్మసాక్షి! స
త్యము వచియింతు; మేది యెటు
లైనను నిన్ను బరిగ్రహించి న్యా
యముగ వివాహమయ్యెద; మి
హమ్ము తరింతుముసుమ్ము సుందరీ!

స: ప్రభూ!?

శం: మనోవాక్కాయకర్మలతో మాట్లాడుతున్నాం. అన్యథా తలంచకు. నీ అంగీకారం ఆశిస్తున్నాం.

స : మాది...మాది...మాది పల్లెకుల మన్నానుగా ప్రభూ ! ?

శం : అందుకు వెనుదీయం. రాళ్లలో రత్నం, బురదలో పొడమిన పద్మం, కాకులలో పెరిగిన కోవెల సర్వులకూ గ్రహింపదగినవే. అంతేకాదు. ప్రేమకు హెచ్చు లొచ్చులు లేవు. కులమతభేదాలు కూడవు. రా జెవ్వరినై నా వివాహం గావచ్చు. నీ విక సందేహం మాను....నీ సమ్మతి కావాలి....ఏమంటావు ?

స : నేను....నే నస్వతంత్రురాలను ప్రభూ ! నన్ను పెంచి పెద్ద జేసిన తల్లిదండ్రులే నా భావిజీవిత నిర్ణేతలు.

శం : శాబాస్ ! చిన్నదానా ! నీ శీలం నీ స్ఫురద్రూపానికి తగినది. నీతో మే మేకీభవిస్తాం. నీ తలిదండ్రులనే ఒప్పించికొంటాం....అయితే .... వారు .... వారి కీ పెండ్లి సమ్మతమం టేనో ?

స : అందుకు....అందుకు....నాకు...ఉహుఁహుఁ...

(చిన్నగా నవ్వును)

శం : చాలా సంతోషం సుందరీ ! చాలా ఆనందిస్తున్నాము.

మరల చిగురించి పెరుగు నీ మ్రాను ; మేము
భూతలస్వర్గసుఖములు పొందగలము ;
నిర్మలానందగతి రమణీయకళలు
గాంచు నిక హస్తిసామ్రాజ్యకాంత రమణి !

మే మిదే నీ తలిదండ్రులవద్దకు పోతున్నాం. వారిని మెప్పించి వొప్పిస్తాం. అప్పుడు నిన్ను స్వీకరిస్తాం. పోయి వస్తాం.

(ముందుకు నడచి మరల వెనుకకు వచ్చును)

ఇంతకూ నీ మాతాపిత లెవ్వరు చిన్నదానా ! ?

స : దాశరాజు మా తండ్రి.

శం : ఓహో !....అతడేనా ? ... ఉత్తముడు ... మా కోరిక మన్నిస్తాడు .... మన వివాహం విధిలిఖిత మన్నమాట.... అయితే....అయితే....నీ పేరేమిటి సుందరీ ! ?

స : నన్ను...సత్యవతి...అంటారు.

శం : ఆహా ! ....చక్కని పేరు. మధురనామం....సత్యవతీ శంతనులు....ఓహో ! చక్కని మిధునం....చక్కనిది.... చక్కనిది.

( సత్యవతిని చూచుచు నిష్క్రమించును )

[సత్యవతి చిరునవ్వుతో క్రీగంట చూచుచు శంతనునివైపు నడచును. ]

స : చిత్రమైన సంఘటన.

కాకిపిల్ల పొందు కలహంస కోరునో !
బొమ్మరాల కెంపు పొసగనగునో !
దోమతోడ గజము దోబూచులాడునో !
యీ విరుద్ధఘటన యేటిదగునో ! ॥

స్వామీ ! పరాశరమునీంద్రా ! ఇది మీ ప్రభావమే కావాలి. మీ ఆశీర్వాదబలమే యీ దుర్గమారణ్యంలో త్రోవ జూపుతున్నది. మీరు దయచేసిన వరము రూపము ధరింపనున్నది....మీ పవిత్ర పాదపద్మాలకు మరోమారు నమస్కరించికొంటాను స్వామీ ! భారమంతా మీదే.

( నమస్కరించుచూ నిష్క్రమించును )

( తెర పడును )

# చతుర్థాంకము

## 1-వ రంగము

## దాసపల్లెలో దాశరాజు గృహము

[ రంగరాజు సత్యవతి మాటలాడుచుందురు ]

రం: కాదే లప్పా !....అవునే....కాదే.

స: ఏఁవిట్రా ?

రం: అదేనే...నాకు తెల్లేదే....మారాజుగారే....అలా సూశా రేంటే నీవంక ?

స: ఎలా చూచారు ?

రం: పిచ్చోళ్ళాగు సూళ్లేదంటే ? బాబుతోటి మాటాడతున్నా నీవంకే సూత్తారు. అమ్మతోటి మాటాడతున్నా నీవంకే సూత్తారు. నాతోటి మాటాడతున్నా నీవంకే సూత్తారు.... ఎందుకే అలా సూత్తారు ?

స: ఏమో .... ఎందుకుచూచారో నాకేఁవి తెలుసునురా ?.... నేను చూడలేదుగా ?

బొమ్మలు దీన్లోను! ఆల్చిప్పలు, గవ్వలు, నత్తలు, బెత్తు మరిగిలు, బోల్డన్ని బొమ్మలున్నయ్యి దీన్లో. ఈ కిరీటకం యేసుకుంటే యెలాగున్నావో సూసుకోరా బుల్లోడా! యెలాగున్నా విప్పుడు? (అద్దంలో చూచుకొని) ఉఁ హుఁ హుఁ....సందమాఁవరంగులు సక్కొచ్చేసినియ్యిరా నీ మొకంలోకి:....అరరే, అరరే, అసల్దే మరిసిపోయావురా మందకోడి మందా!....తూరాయో!....తూరాయి లేక పోతే కిరీటకం మొగుడుసచ్చిన ముద్దు ముండ గాదంట్రా మొద్దూ?... తూరాయి సూసుకోవొద్దంట్రా? యీ కొంగీకి తూరాయి గుమ్ము గుమ్ము నెలుగుతుంది గాదంట్రా నీ తల మీద? యీ నెఁవిలికళ్లు నిగనిగా నిప్పురవ్వల్లా గెలుగు తున్నయ్యి గాదంట్రా?...యిప్పు డెలాగున్నావో సూసు కోరా రంగన్నా! (అద్దములో చూచికొని) ఆఁ. ఆఁ. రంగరాజుగారులా గుప్పుడున్నావురా రంగా! అరిచ్చేందు రుళ్లాగున్నావురా. రాఁవులోరు నీ పోలికేరా...అత్తిపట్టాని కతికా రెవరిప్పుడు?....సెంతనమారాజుగారు....ఆఁ. ఆఁ... ఆ మారాజుగా రుప్పుడు నీ ముందు మసిబొగ్గేరా గుంటడా!

[ శంతనమహారాజు ప్రవేశించి నవ్వుకొనుచూ ఒక ప్రక్క నిలచును. [

ఏవండోయ్ రంగరాజులుంగారూ! మీరు మీ రాజ్జిం యేలుకోండిక. యే పెఙ లెందుకొచ్చేరో యిశారించు కోండి? యెవురి కేం గావాలో యివరా తెరుకోండి.... ఆఁ...ఆఁ...అట్టాగే....అట్టులాగే....యిశారింతాం నేరాలు... వొవరివయ్యా నువ్వు?

(శంతనుని ప్రశ్నించును.)

నిన్నే అడిగేది. సీ సీ సీ రంగారాజులుంగారు పెసినిం తున్నారు. పళ్ళికిలింతువుగాని పలకవేటి ? సెప్పు. సెప్పు....నువ్వొవరవ్ ?

శం: మేఘు.... మేము....

రం: మే మేంటి ? .... యేము.... మేము.... నిన్ను నే నడుగు తున్నాను. నేనంటే యెవరు ? రంగరాజులుంగారు. లుంగారడిగీ పెసినికి కంగారెందుకు ? దొంగవేంటి నువ్వు ? అందుకేనా కంగారు ? నోట మాట రాదేం ? తప్పుసేస్తివా? అయితే .... సిచ్చింతాం. రాజులుం .... సెప్పు .... సెప్పు.... వొవరవు నువ్వు ? ఎందుకొచ్చావు ? యేంగావాలి ? దొంగవా ? దొరవా ? యేఊరు నీది ? యెక్కడినుం చొచ్చావు ? యెప్పుడొచ్చావు ? యేం తప్పుజేశావు ? సొప్పు....సొప్పు....వొక్కమాటతో సమాదానం సొప్పు.

శం: నీ వెవ్వరవు ?

రం: తూట్ ! అతికప్పెసంగం. నిన్ను నే నడుగుతుంటే నన్ను ను వ్వడుగుతువేఁటి ?

శం: దాశరాజున్నాడా ?

రం: డా ! డా ! డా !? సీ సీ సీ రంగరాజులుంగారి తండిగారు. దాశ దొరగారు....డా ! డా ! డా !....నీకు డా ! డా! డా!? పెద్ద తప్పు....మాపరాదం....నిన్ను సెమించం. నీ కేం సిచ్చెయ్యాలి ? ....నువ్వే....నువ్వే సొప్పుకో.

శం: ఓహో ! మీరు దాశరాజుగారి కుమారులా ? రంగరాజు లుంగారా ?

రం : ఔ ఔ....కళ్ళు బాగా కనమడవేంటి ? బాగా సూడు....
యీరు... యీరు .... రంగరాజులుంగారు. కట్టిసేతబట్టి
కదిలినరంటే కసీల్ని కం[డించేత్తారు. యిశారణ కొచ్చిన
రంటే యెంతలావుదొంగనన్నా జుట్టు దొరకముచ్చు
కుంటారు...సూస్కో....సూస్కో యీడిసెత్తి. సూస్కో
యీడి సెంతకారం. గెడియిలో గెయించేసుకున్నాడు
కిటుకు....పటది ?....పటంటే కత్తేటులాగ గరిజింతున్నాం
కాసుకో. యిడిసేత్తున్నా పిడుగు. యేటపోతు నేసేత్తున్నా.
నువ్వు .... నువ్వు ... దొంగవి ?....నువ్వు దొంగోడువి....
నువ్వు గజిదొంగోడువి.

( పెద్ద పెద్ద కేకలు వేయును. )

( తెరలో )

యేంటి రంగా !? యేంట్రా గోల ?

[ దాశరాజు ప్రవేశించును. ]

దా : అదేంట్రా రంగన్నా !....ఆ యేసం వేంట్రా ?

రం : రంగన్నేంట్రా దాశన్నా !? రంగరాజులుంగార్రా
యీరు. యిట్టుమూరితిరా. యీ పెజల్లో తప్పొప్పు
లిశారింతున్నార్రా...తొలుగు తొలుగురా...యీ పరదేశి
యీ అపరాది.......యీ దొంగ........

( అని వ్రేలితో చూపుచూ శంతనునివైపు నడచును. )

( దాశరాజు వెనుకకు తిరిగి శంతనుని జూచును. )

దా : అఁ .... ఆఁ ... ఆఁ .... తంరు !.... తంరా బాబయ్యా !
దండాలు బాబయ్యా !

(శంతనునికి నమస్కరించును.)

రం : దండింతం. దండింతం....నువ్వు తొలుగు...యీడెవుడో ....యీడేడో....

దా : ఓరి బాబోరి బాబోయ్ !....యేంట్రా యిది పిచ్చెదవా ! యేరనుకున్నావురా ? మారాజులురా. మన శక్రవార్తి గార్రా. శంతనమారాజులుంగార్రా చన్నాసీ ! మొఖుటు కూతలేంట్రా మొద్దూ ! ?

(నోరు మూయును)

రం : బాబా !....బాబా !....మరిగంటే....మరిగంటే....

దా : నోరుముయ్....ఆ మారాజుల పాదాలమీ దడు.

(రంగరాజును శంతనుని పాదములపైన పడవేయును)

....దండాలు బాబయ్యా ! దండాలు....కుర్రగుంటడు. పిచ్చి చన్నాసి....యేసం వేసుకుని....యేం కూశాడో యేం జేశాడో మారాజా ! అపరాదం అయ్యిగారూ !? సెవించుకోండి బాబయ్యా !

(శంతనుని పాదములపైన వ్రాలును)

శం : ఫరవాలేదు దాశరాజా ! లేవండి. లేవండి.

(లేవదీయును)

మీ రంగరా జిప్పుడు రాజపాత్ర ధరించాడు. ధర్మం విచారిస్తున్నాడు. చాలా అందంగా ఉన్నది పాత్ర. మే మానందించాంగాని ఆగ్రహించం దాశరాజా !

దా : మా మారాజులు. మా దర్మప్రెబువులు. మా తండులు....ఒరే రంగన్నా! పరిగెత్తుకెల్లి సాపట్రారా. మీ అమ్మ నిల్చుకురారా !

(రంగరాజు పరుగున నిష్క్రమించును)

ఓసి మాతింగీ ! మాతింగీ ! రాయే రాయే.... రాజు లొచ్చేరే మనింటికి. రాయే రాయే.

( రంగరాజు చాపతో ప్రవేశించును. చాప పరుచును )

దానిమీద దయిసెయ్యండి బాబయ్యా ! .... కూసోండి.

( శంతనుడు చాపపై కూర్చుండును )

బాబయ్యా ! కుందనాలు కురిసీలుమీద కూకునీ మారాజులు. జమ్ముసాపమీద సతికిలమడ్డారు...యేం జెయ్యిఁవయ్యా ! ?

[ మాతంగి ప్రవేశించును ]

మా : యేంటయ్యా !···· యేంటది ?

దా : మన మారాజులే....సూడే, సూడే, సెక్రార్తులే. సెంతన మారాజులే.

మా : అయ్యిబాబయ్యిబాబోయ్ ! యేం టీ యిచ్చిత్తరం !

దా : యిచ్చిత్తరంగాదే. మనదుట్టఁవే, దణ్ణఁవెట్టే.

మా : దణ్ణాలు బాబయ్యా ! దణ్ణాలు.

( నమస్కరించును )

యేంటిది బాబయ్యా! యేనాడూ యెరగం రాజేందురు లిలాగాటం. యీయాల రో జిలా దయిసేశారేటో. యిప్పుడు మిమ్మల్నెలా మర్రేద సెయ్యాలి బాబయ్యా !?

దా : దాసిగా డేం జెయ్యాలో దయసేసి సెలవెట్టండి బాబయ్యా! మిమ్మల్నెలా మర్రేద సెయ్యాలోకూడా యెరగనోళ్లం బాబయ్యా!

శం : ఉఁహుఁహుఁ .... మీ ఆతిథ్యాని కానందించాం దాశ రాజా! మీ అమాయికప్రేమే మాకు మర్యాద. అన్య మర్యాద లక్కఅలేదు. ఈ ప్రక్క అడవుల్లో వేటాడ వచ్చాము. యమునానది రేవువద్ద మీ సత్య కనిపించింది. నీ కుమార్తెనని చెప్పింది. నిన్ను చూచిపోదామని బుద్ధి పుట్టింది. నీతో ముచ్చటిద్దామని యిలా వచ్చాము.

దా : అలాగా బాబయ్యా! అలాగా? ... సూశావంటే మాతింగీ! సత్తోతి సకినా లెంత సత్తివో సూశావంటే?

మా : అవునవును .... సత్తివైన సకినాలు. మారాజులు మనింటికే వొచ్చేశారు. మనిల్లు పండింది. యింతకన్నా యేం సుబంగావాలి మనకి?

దా : మనమ్మ యేటనుకున్నావే మరి? బంగారం బరిణే. అదుట్టంగలమ్మే.

శం : మీ కన్నకూతురు .... సత్యవతి .... నిజంగా అదృష్టవంతు రాలేనయ్యా?

మా : అమ్మే మా అదుట్టంబాబయ్యా! ....సత్తోతి .... మా అమ్మ....

దా : మేం పేఁవతో పెంచుకున్న పెద్దబిడ్డ బాబయ్యా !

శం : పెంచికొన్నారా ! మీరు కన్నబిడ్డ కాదా ?

దా : ఉఁహుఁహుఁ....మా కడుపు నింత మూలచ్చిఁ వుడతదా బాబయ్యా ! ?

బురదమట్టిలోను పుడతదా లచ్చిఁవి ?
లచ్చిఁవమ్మ మంచి లచ్చనాలు
పునికి పుచ్చుకున్న బూలచ్చి మా సత్తి:
వమ్మ మేఁవు కన్నదాన బాబు ! ? ॥

శం : అలాగా ? అయితే....ఆమె యెవరు కన్నబిడ్డ ?

మా : సేప బాబయ్యా ! సేప కడుపులో దొరికింది.

శం : ఆఁ ! ?

దా : అంతే అయ్యగారూ ! మా అమ్మపుటక సాలా ఆచ్చిరిం. అదొక సిన్న కత.

శం : ఏమది ? మేము వింటాం. చెప్పు దాశరాజా !

మా : సెప్పు సెప్పయ్యా !

దా : సెప్పుతానే....సెబుతా ! బాబా రంగన్నా ! సంద లడ బోతుంది. అక్కడెయ్యెక్కడే వుందక్కడ. నువ్వెల్లి తీసుకు రారా బాబా !

మా : యెల్లెల్లు బాబా !

(రంగరాజు నిష్క్రమించును)

ఊఁ....యింక సొప్పయ్యా !....అది సాలా సిత్రం అయ్య గారూ ! యీ యేలకి పదిమీదెనిమిదేళ్లయ్యింది జరిగి.... ఆరోజుని....ఆరోజుని....

దా : యెంపునానదిలో కేటగా శ్లేటకెళ్లేరు బాబయ్యా! వొక పెద్దసేప నోలతోశే పట్టుకొచ్చేరు. నాకు నదురు సది వించారు దాన్ని. దాన్ని కోత్తే దానిపొట్టలో కామడ్డారండీ మా సత్తమ్మా యింకో సంటిబిడ్డాను.

శం : ఆఁ!?....ఆ చేప యేమయింది ?

దా : ఆదిలో అది సేపకాదంట బాబయ్యా! అద్దిరికి అనేసువొంటి అప్పసరసంట. బెమ్మదేఁవుడు సేపంసేత పెద్ద సేపయిందంట. నదిలో పడుందంట. పొట్ట కోసీటప్పటికల్లా సేపనాకారం పోయిందంట. అప్పుడుకప్పుడే అచ్చర సయి మా ముందు నుంచుంది. మా కీ కత సెప్పి మాయిఁవయింది.

శం : ఎంత చిత్రం !

మా : సిత్తం అయ్యిగారూ! సేపకడుపులో మనిసిపిల్లలు. సిత్రంగాదండీ!? సోద్దింగా సూశారు బాబయ్యా సుట్టు పక్కల జెనఁవందరూను....బిడ్డల్ని పైకి తీయించాడు మీ దొర. మిలమిల మెరిసిపోయా రయ్యిగారూ బిడ్డలు! అయితేనేం?....అబ్బబ్బ? ఓసన! నీసోసన! సేపలకన్నా సెడ్డోసన గొట్టేరు. తానం జేయించాం బిడ్డల్ని. కత్తూరి, తుంగెడ్డలుదూలి మెత్తివోళ్లం ఒంటిమీ దోసనోతాకి. పేఁవగా పెంచుకున్నాం బాబయ్యా! సత్తోతి, మత్తిరాజు అని పేర్లెట్టుకున్నాం.

దా : అయిదేళ్ల బిడ్డలయ్యారు బాబయ్యా! ఒకరోజుని మచ్చి దేసిం మారాజు లొచ్చే రిక్కడికి. దేయితి కల్లో తెలసెప్పిం దంట వొరపుత్తురుడున్నాడు మావొద్ద అని. మొగబిడ్డని

తన కియ్యమని తెగదేబిరించారు బాబయ్యా! యిడలే కిడ లేక యిచ్చేశాం. ఆ మారాజా బిడ్డ నట్టుకెల్లి మచ్చిదేశింకి మారాజుని సేశారు బాబయ్యా!

శం: అయితే సత్యవతి మీవద్దనే పెరుగుతున్నదా?

మా: అవునయ్యగోరూ! మా సత్తి మాయింటి మాలచ్చిఁవి. అదుట్టఁ వందుకుంది మా కాయేలనుంచీ. సిరిసంపదలతో బురబుర లాడుతున్నాం బాబయ్యా!...అమ్మొచ్చి నెన కాల రత్తమానిక్కింలాగ రంగరాజుట్టేడు. సంతోసం గున్నాం బాబయ్యా!

దా: సిత్తం అయ్యగారూ! సిత్తం.

సెట్టు పండవొచ్చు; సేలును పండొచ్చు;
యిల్లు పండవొచ్చు సల్లగాను;
యెన్ని పంటలైన యెందుకు సెప్పండి?
కడుపు పండకుంటె గాతగంద?॥

సంతానం బయిల్దేరింది. సంతోసంగున్నాం బాబయ్యా! మా సత్తిఁవమ్మని సూశారుగందా? దేవకన్నికం టందం. తియ్యమాఁవిడి పండంటి గుణం. మానిం క్కిలాంటి మంచినడక. తఁవర్లాం టతికార్లుకూడా ఔననదగ్గ అమ్మ అయ్యగారూ!

శం: నిజమే దాశరాజా! మీ సత్యవతి సమస్త సత్కళాప్రపూర్ణ, సద్గుణవతి, సుశీల.

దా: సిత్తం. సిత్తం...సూశావంటె మాతింగీ: బాబుగా రేం వన్నారో? పరాసిరిబాగోతు లన్నదీ యిదే గాదంటే? అమ్మ పుట్టుపూరోత్తరా లన్నీ ఆదిలోనే సెప్పేరు

గాదంటే? అవునేమరి... యెక్కణ్ణుంచొచ్చి నిత్తనం? వొసుమారాజుగారి సంగరంగాదంటే మరి?

శం : అదేంవిటి దాశరాజా!? సత్యవతి వసుమహారాజు సంగరమా?

దా : అవును బాబయ్యా! పరాశిరమునీసులు సెప్పేరు. అదొక నిత్తరం.

శం : ఏంవిటది దాశరాజా!? ఏమది?

మా : ఆ కతకూడా సెప్పవయ్యా అయ్యిగారికి.

దా : సెబుతా, సెబుతానే. మరిగంటే బాబయ్యా! వొసు మారాజుగారి బార్య గిరకమ్మంట గాదండీ!? ఆయమ్మంటే ఆ మారాజుకి మా గారం. అతిగారాం. యేటకెల్లే రొక రోజుని. యేటలోకూడా గిరికమ్మకోసం యిరహాపడ్డారంట. యిందిరం జారి పడిందంట. సెత్తిగల యిందిరం వుత్తదానికి పోగూడదనుకున్నారంట. యిత్తరి దొన్నిలో కెత్తించారు దాన్ని. మూట గట్టించేరు. పెంపుడు డేగని పిల్చి దాని ముక్కుగ్గట్టేరు మూట. రాణీకిచ్చి రమ్మన్నారు. ఆకాశం మీదు లెగిరెల్తుంది డేగ. మద్దిమార్గంలో మరొకడేగ సూసింది యీ డేగనీ, దాని ముక్కునున్న మూటనీ. మూటలోది మాసంమనుకుందది. మూట తన్నుకుపోబోయింది. ఒప్పుకోలేదు ముందు డేగ. డేగలు రొండూ బాగా గుంజు లాడినియ్యి. ఆ కొట్లాటలో మూటగట్టినాకు పీకుడు పీకు డైపోయింది. అందులో యిందిరం అట్టే పడిపోయింది కిందున్న యెంవు సేట్లో. పడీ పట్టంలోనే దాన్ని మింగేసింది

ఆ మీను. మింగి గరబం దాల్చింది. ఆ సంతానం మా సత్తోత్తి, మత్తిరాజూ బాబయ్యా !

శం : ఆహాహా ! సత్యవతి వసురాజుకూతురా దాసరాజా ! ? వసురా జంటే యెవరో తెలుసా ? ఆయన మహారాజు. మహాప్రతాపశాలి. దేవేంద్రునికి ప్రియమిత్రుడు. ఇంద్ర ప్రీతికై యేటేటా యింద్రోత్సవాలు చేయించేవాడు. దివ్యవిమానంమీద దేవలోకానికి పోయి వస్తుండేవాడు. ఉపరితలయానం చెయ్యటంచేత ఆయనకు ఉపరిచరుడు అని మారుపేరు వచ్చింది.

దా : కామోసులెండి. సత్తెమ్మ పూరోత్తరం పూసగుచ్చినట్టిలా సెప్పేరు పరాశరయ్యగారు. ఆ మాతుమ్మలు అమ్మని నాసీరదించారు. ఓజినిందూరం వోల్లు మల్లిపువ్వోసన కొడతదని వోరం యిచ్చారు. మూరా ణవుద్దన్నారు బాబయ్యా !

శం : తప్పదు దాశరాజా ! మీ సత్య రాణి కాక తప్పదు.

> రాణు లందరికిన్ శిరోరత్నమగును ;
> అఖిలభారతనేత కర్ధాంగి యగును ;
> కురుకులంబునకున్ గొత్తకోడ లగును ;
> శంతనుం డప్పు డాత్మవిశ్రాంతి గనును.

దా : సిత్తం బాబయ్యా ! సిత్తం. మూరాజులు తలవదీయిని దారితప్పదు. ఆనాడు ఋసీసులూ అంతే అన్నారు. అమ్మి రాణమ్మవాలి. యెలాగవుద్దోమాత్రం మూ కిడిపోటం లేదు.

తగ్గ పెళ్లికొడుకుని తఁవరన్నా యేరుపాటు సేయించండి బాబయ్యా ?

శం: నీ సత్యవతి పెండ్లి నిశ్చయమైపోయింది దాశరాజా ! కావలసినది మీ అంగీకారం. అంతే.

దా: బాబయ్యా! బాబయ్యా! మా దొర్లమాట మా కోరాలుమూటకందా. యిప్పుడే మేం అంగీకరించాం అనుకోండి తండీ! సీగ్గరంగా పెళ్లి సేదాం. పెళ్లికొడు కెవరో సెలవిప్పించండి బాబయ్యా!

శం: మరెవ్వరో కాదయ్యా! కౌరవవంశాలంకారులు. ఇప్పుడు నీ యెదురులే ఉన్నారు.

మా: (అన్నిప్రక్కలు చూచి) యేరూ లేరే.

దా: మా కన్నమల్లేదు బాబయ్యా! యే రా మారాజు బాబయ్యా ! ?

శం: ఉఁహుఁహుఁ ....అమాయిక దంపతులారా ! మీ కింకా తెలియదా ? వివరించి చెబుతాం వేడుకగా వినండి.

మేమే ; సత్యవతీకరగ్రహణ మే
మే చేయనున్నార మో
మామా ! మీ సుకుమారి ముందుగనె స
న్మానించె మా కోరికన్ ;
నీమీదం గల దెల్ల భార మిపు ; డం
గీకారముం దెల్పుమ
య్యా ; మమ్ముం గృప జూడుమయ్య ! ; యిడుమ
య్యా ; మాకు మీ కన్నియన్ ॥

మా : అయ్యో బాబయ్యో బాబోయ్! అయ్యోగారూ!

దా : బాబయ్యా! బాబయ్యా! తంరు....తంరు....

శం : తొట్రుపడవద్దు దాశరాజా!

దేవతలు సాక్షి; సాక్షి భూదేవి; సూర్య
చంద్రు లాకసవాణి, మా యాత్మ సాక్షి;
సత్యను వరించితిమి; ధర్మశాస్త్రవిధిని
పెండ్లి యగుదుము; మీరు దీవింపుడయ్య!॥

మా : అయ్యమ్మయ్యమ్మో! అయ్యమ్మయ్యమ్మో!
....లమ్మా!....సత్తోతీ!

(ఆనందపరవశరాయై పడిపోబోవును)

దా : (మాతంగిని పట్టికొని) ఆహాః! ఆహాహాః! ఆహాహాః!

(పరవశుడగును)

[సత్యవతి ప్రవేశించి సిగ్గుతో ఒకప్రక్క ఒదిగి నిలచును]

శం : సత్యా! నీ యభిమత మీడేర్చాము. నీ మాతాపితలు మన పెండ్లి కంగీకరించినట్లే. వారి అపరిమితానందమే అందుకు సాక్ష్యం. వారి ఆనందం చూడు...చూడు.

[రంగరాజు ప్రవేశించును]

రం : అయ్యోబాబయ్యోబాబోయ్!...అమ్మా! బాబా! అలా బిగుసుకుపోయారేంటి? లమ్మా!... లప్పా!... యేరా బాబా!? యేంటిది?

శం: భయంలేదు. పట్టలేని ఆనందంతో వాళ్లు పరవశు లయ్యారు...అందుకు కారణం మీ అక్కయ్య నడుగు.

రం: లప్పా! లప్పా!....యేంటే యిది?

శం: ఆ ఆనందాని కర్థం జెప్పు సత్యా!

దా: (కంటినీరు తుడుచుకొనుచూ) ఆనందంవే బాబయ్యా! బెమ్మానందం. దరినికీ కొండకీ తాళంవేసినం తానందం, మాయింటి పిల్ల మారాణై తే, మా అతికార్లు మా అల్లుళ్లై తే అంతకంటే యిం కే దానందం బాబయ్యా!? సాలా సంతోసం గుందండి.

మా: అంతే బాబయ్యా!

శం: అయితే... మీ రీ వివాహాని కంగీకరించినట్లేనా?

మా: అట్టే బాబయ్యా!... అట్టే.

దా: అంతేనయ్యా!...కాదంటే...కాదంటే...

శం: ఏంవిటా సందేహం? మొగమాటపడవద్దు. కావలసినది గట్టిగా చెప్పు దాశరాజా!

దా: అట్టాగే బాబయ్యా! అట్టాగే...దరమరాజులొద్ద దాపరకం దేనికి? గుండిల్లో మాట గుట్టిడిసి సెబుతా.... కోరికి....నా కోరికి....ఒక్కటే బాబయ్యా!

శం: ఏంవిటది? ఏమైనా కోరవయ్యా! నీ కోరిక తీరుస్తాం.

దా: అదే బాబయ్యా! అదే....అది సత్తెమ్మ అంతరానికి తగింది. పరాశిరబాగోతులు పలికింది. అమ్మ కుర్ర

తనాన్నుంచి నా గుండిల్లో గురగుర లాడతున్నది....అది అది...

మా : అదేటో యిడగోసి సెప్పయ్యా! నానమాలు బియ్యం లాగు నానబెడతావేంటి?...సెప్పు....తొరగా.

దా : అదేనే.

కన్ని సత్తివతికి కలిగేటి తొలిసూలు
పెద్దబిడ్డ రానగద్దిమీద
యెక్కి రాజ్జిం వెల్ల యేలాలి; సూడాలి
మమ్మ నేను రాజమాతగాను.

స : బాబా! బాబా!?

శం : దాశరాజా! దాశరాజా!

మా : యేం? యేం? యేంటది?....యేటన్నావేటయ్యా!?

శం : ఏమన్నాడా?...సత్యవతికి పుట్టిన పెద్దబిడ్డ రాజుకావాలట. చూచావటమ్మా!? అది సాధ్యమా?

మా వెన్కన్ భువినేలగాదగిన ధీ
మంతుండు గంగాపగా
దేవీపుత్రుడు పుత్రుడుండెగద ముం
దే? రాజుగా నా చిరం
జీవిం జేయుట రాజధర్మముగదా?
చీకొట్టదా లోక మా
త్రోవం దప్పి మరొక్కవాని నరనా
థుం జేయుచో నక్కటా!?॥

తాతల్ తండ్రులు ధర్మమార్గగతు ; లా
ధర్మమ్ము వర్ధిల్లె మా
చేత న్నేటికి ; దాని తప్పుటకు మా
చే నౌనె సుంతేని ? భూ
నేతం జేసిన నీ కుమార్తె సుతునిన్
నీకేని మాకేనియుం
గాతం జేసిన దుర్యశమ్ము గలుగున్ ;
గాసంత యోచింపుమా.

మా : బాబుగారి మాట బాగా యినుకోయ్యా ?

శం : దాశరాజా ! నీవు ధర్మాత్ముడవని వింటాం. ధర్మా ధర్మాలు బాగా పరిశీలించు. అంత్యనిర్ధారణ తెలుపు.

దా : సిత్తం. సిత్తం....గుండిల్లో గూడుగట్టుకున్న కోరి కెల్ల మోసుకున్నాను...ఆపైని....ఆపైని....

మా : ఆపై నింకేంవుంది ? మనకంతిగాలఁవే. మారాజులు మట్టిసేశేత్తారు మనల్ని.

శం : కాదమ్మా ! కాదు....కయ్యంతో వియ్యంగాదు మేము కోరినది. మీ సత్యను ప్రేమించాము. ప్రీతి గలిగి మీరు సమ్మతిస్తే పెండ్లిచేసికొంటాము. మాకు భయపడిమాత్రం పరిణయం చెయ్యవద్దు.

మా : తంరికన్నా తగ్గ మొగుడెవరు బాబయ్యా మా తల్లికి ? గంతేసి కల్లేణం సెయ్యాలి. గొంతెమ్మ కోరికిలన్నీ కోర తున్నాడేటో యీన. యేఁవయ్యా ! ? యేఁవంటావేటీ ? తిక్కదిరిగిందా ? లేదా ?

దా: తిక్కగాదే యిది. తేరుకున్న నీరే. నీటడుగు స్నేలే. యెలాగుంటే అలా తేలిందే అది.

మా: అయ్యో నీ అన్నాయిం ఆరిపోనూ! యేంటయ్యా యీ యేసం?

దా: అయితే యిక నీ యిట్టవే. అయ్యగారి దయే....దణ్ణం బాబయ్యా! సెలవిప్పించండి నాకు.

(నిష్క్రమించును)

స: బాబా! బాబా!

(నిష్క్రమించును)

రం: లప్పా!...బాబా!....బాయ్యగా రొక్కళ్లుంటే పారి పోతారేంటే?...లప్పా! బాబా!

(నిష్క్రమించును)

మా: కోపం వొచ్చిందా బాబయ్యా!?

శం: లేదమ్మా! కోపం గాదు. దాశరాజు తన కోరిక చెప్పేడు. తప్పేంవుంది? ఏది యేమైనా సరే. అతని అభిప్రాయాని కాఘాతం వద్దు. ఈ సమస్యా పరిష్కారం సామాన్యంగాదు. శంతనమహారాజుల కిది ప్రాణసంకటం గాక మానదు.... సరే...అమ్మా! భగవదిచ్ఛ యెలాగున్నదో. చూదాం.... మేము పోయి వస్తామమ్మా!

(నిష్క్రమించును)

మా: బాబయ్యా! బాబయ్యా!

(శంతనుని వెనుక నిష్క్రమించును)

(తెరపడును)

# తృతీయాంకము

## 1-వ రంగము

## హస్తినాపురి కోటప్రక్క పూవనము

[ కల్యాణుని తొడపైన శిరస్సునుంచి దేవవ్రతుడు నిదురించు చుండును. కల్యాణుడు కత్తిరక్తము తుడుచుచుండును. దేవవ్రతుడటు నిటు కదలును. ]

దే: కల్యాణా!

క: చచ్చింది ప్రభూ! చంపేను....ముక్కలు ముక్కలుగా నరికేను. చచ్చింది.

దే: (గుభాలున లేచి) ఏమిటది?...ఆ ఖడ్గానికి నెత్తురేమిటి?

క: అదే ప్రభూ!....అదిగో! చూడండి.

(ముందు చూపును)

దే: (చూచి) హా! సర్పం....చాలా ముదితాచు...ఏమి జరిగింది కల్యాణా!?

క: ఉఁహుఁహుఁ... యువరాజేంద్రులకు గండం గడిచింది.... కల్యాణుని గౌరవం దక్కింది ప్రభూ!

దే: ఆ పాము నన్ను కఱువవచ్చిందా కల్యాణా!?

క: అవును ప్రభూ! నా అంకతలాన్ని తలమోడ్చి హాయిగా నిద్రపోతున్నారు మీరు. చంద్రభగవానునివంక దృష్టి సారించి నే నున్నాను....అదృష్టం ప్రభూ! ఎందుకో మీవంక చూచాను. అమ్మో! యింకేమున్నది!...నా గుండె లింకా కొట్టికొంటున్నవి ప్రభూ!

దే: అది....అది...

క: మీ చెక్కిలిమీదికి సర్పమెత్తి నిలిచింది. ఇక కాటు వేసేదే, చటాలున కత్తి దూశాను. ఖండఖండాలు చేశాను... మీరు ఆయుష్మంతులు ప్రభూ! మృత్యువును జయించారు. బ్రతికి బాగున్నారు...నే నదృష్టవంతుడను ప్రభూ!

దే: నీవుకాదు కల్యాణా! అదృష్టవంతుడను నేను. అప మృత్యువు కల్యాణుని చేతిఖడ్గంతో ఖండఖండాలై పోయింది. ఆహాహా! కల్యాణా! ఈ ఆపత్సమయంలో నీ వెంత కలవర పడి ఉండాలి? ఎంత ఆత్రంతో లేచి ఉండాలి. అయినా నీ అంకసీమను చీమంత కదులనివ్వలేదు కదా! నా శిరస్సుకు చింతాకంత స్పర్శ తెలియనిచ్చావు కాదుగదా!... ఆహాహా! ఎంత లాఘవం! ఎంత జాగ్రత! ఎంత అడకువ! ఎంత రాజభక్తి! కల్యాణా! రామానుజుడు లక్ష్మణుడ విలా అవతరించావా?...ఆహాహా! కల్యాణా! మృత్యుదేవతకు మృత్యువువై మృతప్రాయుని కమృతమైన నీ ప్రాణ దానోపకారానికీ, నీ ధైర్యసాహసాలకూ ని న్నెలా సత్కరించాలి కల్యాణా!?

క: మీ పవిత్ర ప్రేమే నాకు ప్రత్యుపకారం ప్రభూ!

దే: కాదు కల్యాణా!...కాదు.

తనువు ధారబోసినను రాజ్యరమ నెల్ల
దాన మిచ్చికొన్న నేని ప్రాణ
దాన ఋణము తీర; దేనేమి చేదగు?
ముందు వందనమ్ము నందికొనుమ ॥

(కల్యాణుని పాదములపైన వ్రాలును)

క: వలదు ప్రభూ! వలదు....పాపం శమించుగాక!.... లేవండి ప్రభూ!

(లేవదీయును)

దే: కాదనకు కల్యాణా! తగిన సత్కారం తరువాత చేసి కొంటాను. ఇప్పటికి నా కృతజ్ఞత యిలా చూపించికోనీ. నీ ఋణం యిప్పటి కిలా తీర్చికోనీ. ప్రాణదాత పాదాల మీద ఫాలం మోపనీ కల్యాణా!

క: వద్దు ప్రభూ! నా కంటె పెద్దవారు. యువసార్వ భౌములు. మీరు నా పాదాలంటితే నేను పాపాగ్నిలో భస్మమైపోతాను.

అన్నమిచ్చి పెంచు యజమానులకు సేవ
కుండు సేవ జేసికొనుట యగుదె?
ఏమి జేసియుంటి నిన్నాళ్ళకును మీకు?
ఇపటి కృత్యమేని యెంత స్వామి!?॥

దే: ఉఁహుఁహుఁ...నీవు సేవకుడవా? నేను యజమానినా? నీవు నన్ను సేవించాలా? నేను సేవ లందికోవాలా?....

అమాయిక కల్యాణా! మన సంబంధం అంతమాత్రమే కాదు. మన సౌశీల్యాలూ స్నేహానురాగాలే మన బాంధవ్యం. నీవు నాకు సేవకుడవుగావు. స్నేహితుడవు. బహిఃప్రాణానివి. న న్నింతటినుండి 'మిత్రమా' అని పిలువు.

క: 'ప్రభూ' అనక మానలేను ప్రభూ!

దే: నాకు 'ప్రభు' నామం నీ నోట వినను. మిత్రమా! అని ప్రేమతో పిలువు. చెలికాడా! అని స్నేహం సిద్ధించి పిలువు కల్యాణా! .... అంతేకాదు కల్యాణా!

మెచ్చితి నీ గుణమ్ములకు
మేలులు మీరిన రాజభక్తికిన్
సచ్చరితప్రశస్తికి న
సాదృశసేవకు గండమాపి న
న్నిచ్చట నిల్పినందులకు;
నేను కృతజ్ఞుడ; ప్రాణమేని నీ
కిచ్చెద; కోరికొమ్ము వర
మేదయినన్; తలదాల్చి తీర్చెదన్॥

క: ఊహుఁహుఁ...

దే: నవ్వవద్దు కల్యాణా!

కోరియే తీరవలయు నీ కోర్కెయేదొ;
తీర్చియే తీరవలె నేను దేనినైన;
ఒట్టు నాపైన కోరకయుందువేని;
ముచ్చటగ కోరుమీ వరమున్ వయస్య!॥

క: అయితే...అయితే...

దే: ఊc...ఏమికావాలి? .... చెప్పు. సందేహం వద్దు. మోమోటం వద్దు.

అది నీ కోరిక యన్న చేయుదును దా
స్యమ్మెనియున్ నీకు; నా
హృదయమ్మున్ బెకలించి యీయగల; ను
ర్విన్ సర్వమున్ గెల్చిపె
ట్టెద నీ చేత; సమస్తమున్ విడచి నే
డే వత్తు నీ వెన్క; తె
చ్చెద గౌరీపతినైన నీ దరికి; నీ
చిత్తార్థముం దెల్పుమా ॥

క: ఇవేవీ నా కోరికలు గావు. నా దేవవ్రతులు చిరంజీవులై నానాదేశాధీశ్వరులై నవనవోన్మేషకళలతో యెల్లప్పుడూ నా కన్నుల కలవు దీర్చుట నా యేకైక కామితం. ఇతర జగత్తుతోగాని, జగత్తులోని సిరిసంపదలతోగాని ఆ జగన్నేతలతోగాని నాకు పనిలేదు ప్రభూ!

దే: ....నీవు సన్యాసివి కావుగదా కల్యాణా!?

క: కాదు. గార్హపత్యమంటేనే నాకు గౌరవం.

దే: గృహస్థులు కోరికలులేనివా ళ్లుంటారటయ్యా!?

క: ఉండరు.

దే: మరి? నీకు కోరికలే లేవంటావే?

క: నాకున్న కోరిక ఒక్కటే ప్రభూ!

దే: అదే కోరికో.

క : దానికి తరుణం రాలేదు. కొలదికాలంలోనే కోరి కొంటాను.

దే : ఇప్పుడు కాదంటావా ?....ఎప్పుడో మున్ముందు కోరి కొంటావా ?...కల్యాణా ! ఎక్కడ జన్మించావో యెరుగ నంటావు. ఎవ్వరు తల్లిదండ్రులో యెఱుగనంటావు. ఎన్నడూ యేదీ అడుగవు. కాని కోరిక ఉన్నదంటావు. అదికూడా యిప్పు డక్కఱలేదంటావు. మున్ముందంటావు....నీ వృత్తం యేమిటో చిత్రంగా ఉన్నది కల్యాణా !

క : ద్రోహినేమో అనుకోరుకదా ప్రభూ !

దే : లేదు లేదు కల్యాణా !

గుండె లోలిచి దాచికో గల్గుదును నీదు
హ స్తమందునుంచి ; యమృత మట్లు
గ్రోల గలను విషముగోని నీ వొసంగిన ;
లేదు సంశయమ్ము ! లేశమైన ॥

కాదంటే...నీ కామితార్థం యీడేర్చి కాసంత ఋణం తీర్చు కొందాం తృప్తిపడదాం అనికొన్నాను కల్యాణా ! మున్ముందు కోరికొంటా నంటున్నావు నీవు. ఎప్పటి కే స్థితు లేర్పడతాయో యెవరం చెప్పగలం ? అప్పుడు నీ కోరిక తీర్చగలనో లేనో. అదీ భయం....అంతే కల్యాణా !

క : ఆ భయం వద్దు. నా కోరిక దేవవ్రతు లెప్పుడైనా తీర్చ గలిగినదే. అది....మీ చేతిలోనిదే ప్రభూ !

దే : నా చేతిలోనిదా ?.... నా చేతిలో పనా ?....ఓహో !.... ఓహో !...అర్థమయింది...నీ కోరిక తెలిసింది ... కల్యాణా !

నీకోరిక...నీ కామితం...నీపెండ్లి. నీ కల్యాణం. నీ వివాహం. అంతేగా? అంతేగా? ... అవునవును ... అంతే. అంతే... కల్యాణా! ఈమాత్రానికెందుకు సిగ్గుపడతావు? ఎందుకు కోరిక దాస్తావు?...నీ కల్యాణం నేనే చేయిస్తానులే.

మానవతీలలామలకు
మానికముం గొనివచ్చి నేడె నీ
దానిని జేతు; వైభవయు
తమ్ముగ బెండిలి జేతు; మీ కుటుం
బానికి సర్వసౌఖ్య సదు
పాయములం బొనరింతు; నేది నీ
మానసమున్ హరించిన సు
మంగళి? నా చెవిలోన జెప్పుమీ॥

క: ఉఁహుఁహు ... బాగా గ్రహించారు ... నా కామితం, నా కోరిక ... కల్యాణం ... అవును. అవును ... కల్యాణమే. బాగా గ్రహించారు ... అయితే ... అయితే ... అరుగో! మహామంత్రిగారు.

[ అంశుమంతుడు ప్రవేశించును ]

దే: }
క: } నమస్కారం తాతగారూ!

అం: శీఘ్రమేవ కల్యాణసిద్ధిరస్తు! .... ఏం బాబూ! ఏదో వినోదకాలక్షేపం జేస్తున్నారు. నే నడ్డు కాలేదుగదా?

దే : మీ రద్దు కాలేదు తాతగారూ. సమయంలో సాయమైనారు. చూడండి. ఈ కల్యాణు డెవరినో ప్రేమించాడు. పెండ్లి చేసుకో నిర్ణయించుకొన్నాడు. దేవకన్యనైనా తెస్తా నన్నాను నేను. రంగరంగ వైభోగాలా నేనే వివాహం చేయిస్తా నన్నాను ... వివరాలు చెప్పడానికి సిగ్గుపడతాడు. చూడండి స్వామీ! నా దగ్గర యితనికి సిగ్గెందుకు? సిగ్గు విడచి చెప్పమనండి స్వామీ!

అం : కల్యాణం అంటే సిగ్గుగాదటయ్యా?

దే : ఇతనికి నాదగ్గర సిగ్గెందుకు తాతగారూ!? నాకు వివరాలు చెప్పాలి. ఈ వివాహం నేనే చేయాలి. నేడే చేయించాలి.

అం : నేడేనా?

దే : అవును.... నేడే.

అం : ఉఁ హుఁ హుఁ ... అలాకాదు బాబూ!

దే : ఏం తాతగారూ!

అం : అవును బాబూ! యువరాజావారి కల్యాణంతోనే కల్యాణుని వివాహమూ జరగాలి...ఈనాడే కాదు.

క : అలా చెప్పండి తాతగారూ!

అం : అంతే కల్యాణా!

తనువులుమాత్ర మొండొరులు ;
తక్కిన వన్నిట మీర లొక్కటే ;
మనసులు నేకమైనవి ; స
మంబుగ గాదగు మీకు మంచియై

నను మరి చెడ్డ కల్గినను ;
న్యాయమొ మిత్రుని పెండ్లి ముందు చే
జనుట ; యొకే ముహూర్తమున
సాగెడు నిద్దరి పెండ్లి వేడుకల్ ॥

క : అది. అదీ....విన్నారా యువరాజా !? విన్నారుకదా ? అంతే కాదు. జ్యేష్ఠులకు ముందు చిన్నలపెండ్లిండ్లు కావు. పెద్దవారు మీకంటె ముందు నా పెండ్లి న్యాయమా ? కాదు....తాతగా రన్నట్లు మీ నా వివాహాలొక్కటిగా జరిగించటం సర్వజన సమ్మతం. మీకంటె ముందు నా వివాహ మెన్నటికీ జరుగరాదు ప్రభూ !

అం : అంతే చిన్నబాబూ ! అంతే...పోనీ....మీ వివాహం మాత్రం యిప్పుడే యెందుకు జరుగగూడదు ? ... మీ హృదయంలో...యెవరినైనా....? యే కన్యనైనా....?

దే : లేదు తాతగారూ ! లేదు... ఇంతవరకూ నా మనస్సు శృంగారకళనే యెరుగదు...నే నెవ్వరికీ మన సివ్వలేదు.

క : అబ్బా ! ... ఊం....

(తృప్తి నటించి నిట్టూర్చును)

దే : అదిగో ! చూడండి...కల్యాణుడు బాధపడుతున్నాడు.

అం : అవును బాబూ ! మీరింకా యెవ్వరినీ వరించలే దన్నారు. అయితే యింతలో కల్యాణం జరుగదన్నమాటేకదా ? ఇంకా ఆలస్యమయితే కల్యాణుని ప్రేమహృదయానికి కలవరం గాదటయ్యా !?

క : లేదు స్వామీ ! కల్యాణుని తత్వం కలవరపడేది కాదు....
ఈ పవిత్రమూర్తిని సేవించికొంటూ యెంతకాలమైనా యిలాగుంటాను....ఏమైనా మరచిపోగలను....విన్నారా ప్రభూ !

మిమ్ము గనుచుండుటే నాకు సమ్ముదమ్ము ;
మీ దరి న్నిల్చుటే శాంతి ; మీదు కొలువు
రాజ్యలాభమ్ము ; మాట వరాలమూట ;
ప్రేమయంతయు మీలోన పేర్చికొందు ॥

దే : సరే కల్యాణా ! ... నీ కేది యిష్టమో అదే కర్తవ్యంలే....
తాతగారూ ! మీ రిలా వచ్చారేమి ?

అం : మరే బాబూ ! ... నాన్నగారూ ... నాన్నగారు ...

దే : నాన్నగారు వేటనుంచి తిరిగి వచ్చారా స్వామీ ! ?

అం : వచ్చారు బాబూ ! అర్ధరాత్రికే కోటకు చేరికొన్నారట.
ఇంతవరకూ నిద్ర లేవలేదు బాబూ !

క : అయ్యో ! రెండుఝాముల ప్రొద్దెక్కిపోయిందే !

దే : నాన్నగారికి బ్రాహ్మీముహూర్తం ప్రశస్తమే. స్నాన సంధ్యా జప తపాదులకు వారి కదేకాలమే.

అం : అవును ... నిత్యకృత్యాలు కొలది నిమేషాల్లోనే పూర్తి చేసికొని పండుకొన్నారట ... గాఢనిద్రలో ఉన్నారు.

క : వేటలో అలసిపోయారేమో స్వామీ ! ?

అం : కాదు బాబూ ! మహారాజావారు మహాభయంకర యుద్ధాలు చేసినప్పుడే అలుపు సొలుపెరుగనివారు. వేట

వారికొక లెక్కా? ఎన్నిసారులు వేటాడిరాలేదు? ఎన్నడూ యింత గాఢనిద్ర పోయేవారుకాదు ... ఈనాటి నిద్ర యేమో...చిత్రంగా ఉన్నది బాబూ!

వేణు మృదంగాది వివిధ మంగళవాద్య
మృదులనాదములకు మేలికొనరు
వందిమాగధుల కైవార ప్రవచన గం
భీర ధ్వనులకేని మేలికొనరు
పనివాండ్రు వచ్చి యాపాదమస్తక మొత్తి
కీలు కీల్విరిచిన మేలికొనరు
అభ్యంగనస్నాన మాచరింపింప దా
సీలు కాచుకయున్న మేలికొనరు

ప్రాతరుపఫలహారముల్ వచ్చి నిలచె;
అర్థులున్ సభ్యులుం దర్శనార్థ మవల
గూడియుండిరి మన కొల్వుకూటమునకు;
ఏలనో? సార్వభౌములు మేలికొనరు॥

దే: ఆఁ!? ... ఏఁవిటిది తాతగారూ!?

క: ఏమైనా అనారోగ్యమేమో స్వామీ!?

అం: రాజవైద్యులు పరీక్షించారు. అనారోగ్య మేదీ లేదంటారు.

దే: అరే!

క: చిత్రంగానే ఉన్నది.

అం: చిత్రమే బాబూ! ఎన్నడూ సార్వభౌముల నీ స్థితిలో చూడలేదు.

దే: ఎవరైనా మేలుకొలిపి చూడవలసింది స్వామీ!

అం: ప్రభువులను లేపడాని కందరూ భయపడ్డారు బాబూ!

దే: పోనీ....మీరైనా...

అం: ఆఖరికి నేనే సాహసించాను. పలుమార్లు ప్రయత్నించాను. కన్నులు తెరువలేదు. కదలలేదు. మెదలలేదు.... ఒకసారిమాత్రం కన్నులు విప్పి చూచి మళ్లా మూసి కొన్నారు. ఇంకొకసారి ఆ ప్రక్కవారీ ప్రక్కకు తిరిగి మళ్లా గాఢనిద్రలో మగ్నమైపోయారు.....బాబూ! అదేవిటో! హాఁ! అబ్బా! అయ్యో! అని మధ్య మధ్య సంతాపసూచకంగా మూలిగేరయ్యా!

దే: ఆఁ!?

అం: అవును చిన్నబాబూ! మా కెవ్వరికీ యేమీ పాల్పోలేదు. దైవజ్ఞులుకూడా కారణం గ్రహించలేకపోయారు. ఏమి చెయ్యాలో తోచలేదు. ఈ చిత్రస్థితి మీ చెవిని వేసి పోదామని యిలా వచ్చాను బాబూ!

దే: ఏఁవిటిది కల్యాణా!?

క: అది .... అది ... అంతరంగంలో .... యేదో బాధ కావాలి ప్రభూ!

అం: ఆఁ! ఆఁ! అంతే. అంతే నేనూ అనుకొంటున్నాను.

దే: బాధ? .... ఏమిబాధ చెపుమా.

వా రా సేతుహిమాద్రిమధ్యగత యా
వద్ధారుణీ నేతలై
వీరాగ్రేసరులై స్వతంత్రులయి గం
భీరస్థిరస్వాంతులై
సారాచారవిహారులై భువిపయిన్
సాధింపగాలేని దే
మీ ? రాజేంద్రుల యంతరంగమున కే
మీ బాధ ? పాల్పోవదే ! ॥

అం : నేనూ గ్రహించలేకపోయాను బాబూ ! .... మీరైనా వస్తే....

దే : అవశ్యం....నడవండి తాతగారూ !....రా కల్యాణా !

(నిష్క్రమించును)

(వెనుక కల్యాణుడు, అంశుమంతుడు నిష్క్రమింతురు)

(తెర పడును)

## 2-వ రంగము

## రాజాంతఃపురము

[ శంతనమహారాజు శయ్యపైన పండికొని యుండును. అతని ప్రక్కన దేవవ్రతుడు కూర్చుండి యుండును. కల్యాణుడు, అంశుమంతుడు నిలచియుందురు. ]

దే: నాన్నగారూ! నాన్నగారూ!

అం: ప్రభూ!....మహాప్రభూ!

క: మహాప్రభూ!....మహాప్రభూ!

దే: నాన్నగారూ!....నాన్నగారూ!....ఈ మైకం యేమిటి? నిద్రేఅంటారా తాతగారూ!?

అం: నిద్రకాదు బాబూ!....అటూ యిటూ కదులుతున్నారు కదా...మీ వంకచూచారుకూడాగదా....అదిగో! మళ్లా చూస్తున్నారు....ప్రభూ! ప్రభూ!....అయ్యో....కన్నీరు!

దే: ఆఁ!? .... కన్నీరుకూడానా? ... నాన్నగారూ! నాన్నగారూ!

క: మళ్ళా కన్నులు మూశారు .... గుఱ్ఱు .... గుఱ్ఱుపెడుతున్నారు.

అం: గుఱ్ఱుపెడుతున్నారు....కాని అది నిద్రకాదు. కన్నీళ్లింకా కారుతున్నవి.

దే: ఇది చిత్రమే తాతగారూ!....మన మెవ్వరం పిలిచినా మాటాడరు. మంచిముత్యాల్లా కనుదమ్మిరేకులనుండి బాష్పాలు పడుతున్నవి. సూర్యబింబంవంటి సుందరముఖం

ముడుచుకొనిపోయింది. కళావిహీనమయింది. అతివిచారం, త్రీవాలోచన అనంతభయభ్రాంతులతో రాహుగ్రస్తగ్రహ రాజులా గున్నది. శరీరం పసలువాడి పరితపిస్తున్నది. ఆ దీనాలాపా లేవిటి? ఆ వెట్టిచూపు లేవిటి? ఆ వికృతా కార మేవిటి?....గాలిచేష్టలు కావుగదా?

అం: నిత్యజాపకునికి గాలిచేష్ట ఎలావస్తవి? కాదుబాబూ! తప్పక యిదేదో అంతర్భావపరితాపం. ఏదో పరమ రహస్యం గావాలి. బయటపెట్టలేక బాధపడుతున్నారు.

దే: నాన్నగారికి నావద్ద దాచదగ్గ రహస్యమా?

అం: మీ రొకరే ఉంటే యెలాగుంటుందో చూదాం బాబూ! ఏకాంతంగా నెమ్మదిగా మీరే ప్రశ్నించండి. నేను బైట నిలుస్తాను....అంతేకాదు. గౌరాంగునికీ యీనుపానులు కొంచె మవగాహన కావచ్చు. అతనికి కబురు పంపిస్తాను. వస్తా బాబూ!

(నిష్క్రమించును)

దే: నాన్నగారూ! నాన్నగారూ!

క: మహాప్రభూ! మహాప్రభూ!

(శంతను డటు నిటు కదలును)

అదిగో! కదలుతున్నారు.

దే: నాన్నగారూ!

(శంతనుడు కన్నులు తెరచి చూచును)

క: అదిగో! చూస్తున్నారు...మహాప్రభూ!

దే: నాన్నగారూ!

శం: ఊఁ....

(నిట్టూర్చును)

నాయనా! దేవవ్రతా!

దే: ఏమి నాన్నగారూ!? మీ కీ విపరీతస్థితి యేఁవిటి? శరీరంలో యేదైనా అనారోగ్యమా?

శం: కాదు బాబూ!

దే: ఏదైనా విచారమా? ...లేక....భయమా?

శం: కాదు తండ్రీ!

దే: కాకపోతే మరేఁవిటి నాన్నగారూ!?

పాపము జేసినారో పొర
పాటున? యేద్విజులేని దానికై
కోపముతో శపించిరో? ని
గూఢ విదేశపు రాజకీయ సం
తాపమొ? దుష్టశాత్రవులు
దారుణముం దలపెట్టి యీ పురిం
దోపిడి సేయవత్తురో? యె
దో భవదార్తి యెరుంగ జెప్పరే॥

ప్రమథాధీశ్వరు తోడు తెచ్చికొనినం
భంగమ్మొనర్తుం ద్రిలో
కములం; బెల్లును ద్రవ్వి తెత్తు నిటకే
కల్పాగమున్; మొత్తెదన్

యము ; మత్ప్రాణము రాజ్యమున్ విడుతు నా
        హ్లాదమ్ముగా ; మీ మనః
కమలాంతర్గత వేధ మీ సుతునికిం
        గాసంత రూపింపరే॥

శం : శ్రీహరి !....

(నిట్టూర్చును)

క : మహాప్రభూ ! తమ మనోగతాభిప్రాయం తమరే యెరిగించక పోతే మా కెలా తెలియగలదు ? .... మీ ప్రస్తుతదుస్థితి ప్రజలందరికీ విపరీతంగా ఉన్నది ప్రభూ !

శం : ఊఁ ... విపరీతం .... విపరీతమే కల్యాణా !

క : నిజమే ప్రభూ !

పరకాంతలం దాసపడువారలైనచో
        కామగ్రహ మ్మన గలదు త్రోవ
ఇతర రాజ్యములు దోయించెడివారైన
        తిట్టి రేరో యని తెలియవచ్చు
ద్విజులను వేధించి తిరుగు రక్కసులైన
        యేదో శాపమని గ్రహింపవచ్చు
వీరయుద్ధములలో భీరువులగునెడ
        నరివర్గ భయమని యనగవచ్చు

ఏకనారీవ్రతులును ధర్మైకపరులు
విప్రజనభక్తు లత్యుగ్ర వీరయుద్ధ
నిపుణులున్ రాజరాజుల కిపటి దైన్య
తన్ గ్రహించుట కెవ్వరితరము దేవ ! ॥

మహాప్రభూ! ధీరోదాత్తులైన దేవవ్రతులు తమ యేకైక పుత్రులు. వారు వీరాగ్రేసరులు. పితృవాక్యపరిపాలకులు. తమ మనోభీష్టసిద్ధికై మానప్రాణాలు సెలవుపెట్టడానికి సిద్ధంగా ఉన్నారు. మీ విపరీత దీనస్థితికి వేయివిధాల భీతిల్లిపోతున్నారు. అవ్యక్తమైన మీబాధ వారికి హృదయ విదారకమైపోతున్నది. తమ పుత్రునివద్ద తమకు దాచదగ్గ రహస్యం లేదు. వయోవృద్ధులు, అనుభవసిద్ధులు, విజ్ఞాన మూర్తులు—తమకు నీతులు చెప్పగల నేర్పరులం మేము కాదు. మమ్ముల ననుగ్రహించండి. మీ మనసు చికాకు చేసే చింత యేదో దేవవ్రతులకైనా తెలియనివ్వండి మహాప్రభూ!

దే: ఏం నాన్నగారూ!? ఇంకా మాపైన విశ్వాసం గలుగ లేదా? మీ ఔరసపుత్రుడే మీకు పరాయివాడైపోయాడా నాన్నగారూ!?

శం: నాయనా!.... దేవవ్రతా!.... కన్నులవెన్నెలా!

(బేలగా అనును)

దే: అయ్యో... బేలవలె విలపిస్తున్నారు కల్యాణా! ఏం జెయ్యం! నాన్నగారూ! మీ యవస్థితి చూస్తే భయ మెరుగని నా హృదయం బ్రద్దలైపోయేలాగున్నది.

శం: భయపడకు తండ్రీ!

క: తమ బాధ ముందు తెలియనివ్వండి ప్రభూ!

శం: నాకు... బాధ.... యేమీ బాధ లేదయ్యా!

దే : అయితే మీ కిదంతా అకారణ వ్యధేనా నాన్నగారూ! ? ఆ కన్నులలోని అమృతం అకారణంగానే వ్యయమైపోతున్నదా ? ఆ ముఖచంద్రుని కాలమేఘాంధకారం నిష్కారణంగానే కప్పివేస్తున్నదా ?

శం : ఊఁ...ఊఁ....ఏమి చెప్పను తండ్రీ! ?...ఇది...ఇది...ఇది... నాయనా!...దేవవ్రతా!.. మీరు...మీరు...పోయి భోజనాలు చెయ్యండి....నాకు....నాకు....హా (ఆవులించి)....నిద్ర... నిద్ర....వస్తున్నది.

(మరల కన్నులు మూయును)

దే : ఇంకెట్లు కల్యాణా ! ?

క : ఏమీ పాలుపోవటంలేదు....అయ్యో!....ఇంతలోనే గాఢ నిద్ర !

దే : నిద్రకాదు .... మాంద్యం .... అటు నిటు కదులుతున్నారు....అప్పుడప్పుడు కన్నులు తెరుస్తున్నారు.... మాంద్యమే కల్యాణా !....అడుగో! గౌరాంగుడు.

[ గౌరాంగుడు ప్రవేశించును ]

గౌ : ఏం బాబూ ! ? రాతిగప్ప యింకా మేతకైనా లేవ లేదూ ?

దే : ఎక్కడికి పోయావు గౌరాంగా ! ?

గౌ : ఎక్కడికా ? ప్రక్కమీదినుంచి లేచీలేవటంతోనే యెక్కడికి పోవాలో అక్కడికి. ఎక్కడికి పోకుండా మరేపనీ

చెయ్యలేమో అక్కడికి. అడవిపందుల ఆడపడుచులా అన్నయ్యల కేది అత్తిల్లు? అక్కడికి.

క: బాహ్యానికా? .... చాలా ఆలస్యమయింది. మీకోసం యెదురుచూస్తున్నాం.

గౌ: ఆలస్యమయిందయ్యా!....ఇంకా స్నానం, సంధ్య, జపం, తపం పూర్తిగా జారవిడుచుకోలేదుగామరి? మాయదారి మడిబట్ట ఆరేప్పటికి మట్టమధ్యాహ్నమైపోయింది. ఇప్పు డిప్పుడే భోంచేసి చెయ్యిగడుక్కుంటుండగా మహామంత్రి గారు చక్కావచ్చారు మా యింటికి. ఎన్నడూ రాని మహామంత్రిగారు స్వయంగా మా యింటికే వచ్చారంటే గుభాగుభా కొట్టుకొన్నాయి నా గుండెలు. వారు సంగతి కాస్త చెప్పేప్పటికి చల్లబడ్డాయిలే....ఆ చల్లబాటుకుతోడు ఘుక్తాయాసం...ఈ రథాన్ని యీడ్చుకొంటూ వచ్చేప్పటికి యింతాలస్యం అయింది బాబూ!

దే: నాన్నగా రింతవరకూ లేవలేదు గౌరాంగా!

గౌ: మహారాజావారికి మతిపోయిందయ్యా!

దే: ఛీ,

గౌ: ఛీ గాదయ్యా! నాయనా!

వలపువైత్యమ్ము పట్టినవాడు హేమ
యోగమను పిచ్చి గొన్నాత డుస్కవైన
చిక్కువేదాంతమున తల జేర్చువాడు
కల్లుద్రావిన పిచ్చినక్కలు గదయ్య!॥

అలా నిర్ఘాంతపడి చూస్తారేం ? హాస్యగాని మాట లబద్ధాలు గావు. కలకునిజా లుద్ఘాటించి చెప్పేనయ్యా !

క : ఏఁవిటి స్వామీ! రాజావారు మీ చెప్పినవాళ్లో యేజాతికి చెందినవారు ?

గా : నీ జాతికి చెందినవారే భామీ ! నీవంటి సుందరముఖం గల ముగ్ధలజాతికి గుత్తమోపైనవారే కామీ !

దే : అనగా ?

గా : అనగా, రాజావారి నిలువుబొట్టును చుక్కబొట్టు చుట్టు ముట్టింది. రంగు చొక్కాలమీది మోజు బిగువురైకలమీదికి వెడలింది. సామాన్య శస్త్రాస్త్ర యుద్ధంమీద తనివి చాలించి అరవిందాశోక చూత మల్లికా నీలోత్పల సాయకాలతో సమరవిజయం అభిలషిస్తున్నారయ్యా యిప్పుడు రాజావారు.

దే : వలపా ?

గా : వలపుగాకపోతే ప్రేమ. ప్రేమగాకపోతే పిచ్చి.

క : ఏఁవిటిది స్వామీ ! ? కొంచెం తేటతెల్లంగా సంగతి తెలియనివ్వండి.

గా : ఇక మీకెంత చెప్పినా గొడ్డుబుఱ్ఱల్లో గుంజేనయ్యా బాబూ !

శం : హా ! భరతవంశోద్ధారకా ! ... అయ్యో ! .... ఆహాహా ! మోహినీ ! .... ఆహా సత్యా ! .... అబ్బా ! విధీ !

దే : అదేఁవిటి ?

క : కలవరింతలు.

గౌ : ఆఁ ఆఁ .... కలవరింతలు. అంటే జరిగిపోయినసంగతుల జ్ఞాపకాలు. ఆ జన్మలో చేసినకర్మ లీజన్మలో జ్ఞాపకం వస్తే అవి పూర్వస్మృతు లంటారు. జాగ్రదవస్థలో చేష్టలు నిద్రలో నెమరువేసుకోవటం కలవరింత లంటారు....అందులో చిక్కంతా నా కక్కడ పల్లాళ్లు చెప్పేరు. చెబుతా రండయ్యా ! రండి.

( నిష్క్రమించును )

( దేవవ్రతుడు, కల్యాణుడు వెనుక నిష్క్రమింతురు )

( తెర పడును )

3 వ రంగము

## కోటలో రహస్యమందిరము

[ అంశుమంతుడు, దేవవ్రతుడు, కల్యాణుడు మంతనములు చేయుచుందురు. ]

దే : హాస్యవచనాలైనా గౌరాంగుని మాటలన్నీ సత్యాలు స్వామీ !

అం : అలా అనక తప్పదు బాబూ !

క : అయితే యిప్పు డందు కేమి చేదామంటారు స్వామీ !?

అం: ఏమిటా? ఆ దాశరాజు దౌష్ట్యానికి తగ్గ బుద్ధి చెప్పాలి ముందు. యువరాజులుండగా తన దౌహిత్రులు ధరణీపతులు కావాలని యెలాగంటాడు?

తలకున్ మీరిన కోర్కె కోరెగద యా
తం? డిట్లు రాజేంద్రులం
గలతం బెట్టుచు నుండెగా? ప్రభులకుం
గన్యన్ వివాహమ్ము చే
గల మార్గం బిది యేన? చిన్న వయసా?
కాఠిన్య మింతింతలా?
ఖలుడా? సుంతయు తారతమ్యము లెరుం
గన్ లేని చండాలుడా?

పల్లెకు నాయకుం డతడు;
పల్లెకులమ్మునవాడు; రాజరా
డ్వల్లభులే తమంత తము
వచ్చినయందుకు మిన్ను ముట్టడా?
యిల్లు ధనమ్ము ప్రాణములు
నీవలదా? సుతనిచ్చి పెండ్లిసే
నొల్లడ? సార్వభౌములకు
నొక్కటి కోరిక తీర్పజాలడా? ॥

ఇప్పుడె దాసపల్లె కని
పించెద సైన్యము; లేనిబంధనల్
జెప్పక సౌమ్యమార్గమున
సేయునొ పెండిలి కూతు నిచ్చి; యీ

తప్పుడుకోర్కె వీడక హా
తమ్ముగునో తన యెల్లవారితో ;
తప్పక తేల్చివై చెద ; మ
దమ్మును దీర్చెద వాని కింతలో ॥

తన కుమార్తె నెందుకు వివాహం చేయడో? ఎలా చేయడో? ఎంతకాలం యీ అక్రమాభీష్టంతో యెలా ఆటలాడుతాడో చూస్తాను బాబూ!

దే : ఉహుఁహుఁ...తాతగారూ! ధర్మం తప్పని తమకేనా స్వామీ! యీ ఆవేశం ?

అం : ఆవేశం కాదు బాబూ! కర్తవ్యం....ధర్మానికే ధర్మం. న్యాయానికే న్యాయం. అధర్మం, అన్యాయం అణచి వేయటం రాజకీయధర్మం. రక్తానికి రక్తమే. 'వజ్రం వజ్రేన భిద్యతే.' దాశరాజు దారితప్పి సంచరించాడు. మహారాజులకు మహదార్తి తెచ్చిపెట్టేడు. మీకు మహాపరాధం చేస్తున్నాడు. ఈ అధర్మం ఆపకపోతే రాజ్యం అరాజకం గాకమానదు. ప్రజల్లో కలకలం బయలుదేరి కల్లోలం గాక మానదు. ఈ దుర్మార్గుని కింత దుర్బుద్ధి యెందుకువచ్చిందో చూడాలి బాబూ!

క : ఇది అక్రమమే కాదు, అవివేకంగూడాను స్వామీ!

ధర్మపరులుగాన తన్ను సౌమ్యమ్ముగా
కూతు నీయమనుచు గోరినారు ;
ఏమిచేయునాత డింతిని బలిమితో
దెచ్చి పెండ్లియైన ? తెలియవలదె ? ॥

దే : పాపం !

అం : దీనిలో పాపంలేదు చినబాబూ! ప్రభుధర్మాల్లో యిదొకటి.

దే : కాదు స్వామీ ! ధర్మసంస్థాపనకు మార్గం దౌర్జన్యంగాదు. కార్యసాధనకు తగిన ఆయుధం కత్తిగాదు ... పాపం! దాశరాజుతప్పేమున్నది? అతడు శిక్షార్హు డెందుకు కావాలి ?

క : కానికోరిక కోరి ప్రభువులను కలచినందుకు. రాజకీయాలను అచ్చకెక్కించినందుకు.

దే : కాదు. దాశరాజుకోరిక ధర్మంతప్పినది కాదు.

అం : అదేవిటి బాబూ !

దే : అవును తాతగారూ! తమకు తెలియని ధర్మాలు లేవు. ఆత్మీయతకూ రాజకీయానికీ అనుబంధమేవిటి తాతగారూ !? అత డల్లారుముద్దుగా పెంచికొన్నబిడ్డ ఆమె. ఆమె అక్కడ ఉన్నంతవరకూ ఆమెపై హక్కు లాతనివేకదా ?

అం : అందుకే సమ్రాట్టు లతనిని సామంగా కోరేరు బాబూ!

దే : అవును. అతడూ తనకోరిక వ్యక్తంచేశాడు. అంతేగదా ?

క : అంతరాలు మీరిన అభిలాషలా ప్రభూ !?

దే : ఆతని అభిలాష. అంతరాలు మీరలేదే ?

ప్రభువరేణ్యుండగు వసురాజుకూతురు
రారాజుభార్య కారాని దగునె
సంయమీంద్రులు పరాశరుల జోస్యమునకు
కాసంతయేని యాఘాత మగునె

ప్రేముడితో పెంచి పెద్దజేసిన తండ్రి
బిడ్డయున్నతి గోర చెడ్డయగునె
దాశరాజైనను తన యభీష్టమ్ము ని
వేదించికొనుట దుర్విషయ మగునె

కూలివాడైన రాజు కాగోరతగడె
తనకు రాజ్యమ్ము గోరెనే దాశరాజు
కూతుసుతునికిగద, రాజ్య మాత డడిగె
ఇం దతడు చేసికొన్న తప్పేమిటయ్య ! ? ॥

అం : బాబూ ! తర్కశాస్త్రప్రవీణులు తమతో మేము వాదింప తగము. కాని.... కాని.... మీరు ముఖ్యవిషయాన్ని విడిచి వేరు మాటాడుతున్నారు. తాము చెప్పిన ట్లింతవరకూ దాశరాజు తప్పు లేదే అందాం.... అయితే వయసువచ్చి, యౌవరాజ్యపట్టాభిషిక్తులై తమరుండగా తన కూతురి కొడుకును రాజు నెలా చెయ్యమంటాడు బాబూ ! ?

దే : తాతగారూ ! పాపం ! దాశరాజు వయోవృద్ధుడు. చదివి కోసివాడు. రాజకీయాలూ, రాజకీయ నియమాలూ గ్రహించినవాడు కాడు. పరాశరమునీంద్రుల జోస్యమే ప్రధానంగా స్వీకరించాడు. తన మనుమలు మహారాజు లౌతారని తన విశ్వాసం. తన కోర్కె. ఆ అభిలాషతో అతని అమాయకహృదయం అన్య మాలోచించలేక పోయింది. ఈ విషమసమస్య అత డెరుగకపోవచ్చుగదా !

క : సంగతి తెలిసినప్పుడైనా తప్పు దిద్దికోవద్దంటారా ?

దే : అది అతడే నిర్ణయించుకోదగ్గ విషయం. ఇప్పు డాతడు కన్యాదాత. మన మర్థులం. అతని కేది యిష్టమో అది

చేస్తాడు. అందుకు మన మంగీకరింపవలసినదే. ప్రశ్నింప దగము.

అం: ఎలాబాబూ!? అతని దౌహిత్రులు హస్తిపురప్రభువు లైతే, సింహాసనాధిష్ఠులైతే లోకం సహిస్తుందా?

ఎన్నితరాలనుండి భువి
నేలిరి భారతసార్వభౌములై
మన్నన గాంచి యిచ్చట గ్ర
మమ్ముగ మీ మహనీయవంశజుల్ ?
చెన్నటి దాశరా జిపుడు
చేటును దెచ్చునె? మీదు గద్దెపై
దున్నకు చోటువెట్టుదురె?
త్రోవను మార్తురె రాజనందనా!?

యువరాజా! ఆసేతుహిమాచలపర్యంతపరివృతయశశ్చంద్రి కాలంకృతులైన రాజర్షి యయాతిరాజేంద్రుని కుమారుడు కౌరవవంశానికి మూలపురుషుడు. ఆయన ప్రపౌత్రుడు దుష్యంతమహారాజు. ఆయన కుమారుడూ, సర్వదమన బిరుదాంకితుడూ భరతభూపాలుడు సింహాసన మధిష్ఠించి జగజ్జేగీయమానంగా ప్రజను పరిపాలించారు. ఆయన పేరనే మనదేశం భరతదేశం అని పిలువబడుతున్నది. అనేక కౌరవవంశాలు కల్పింపబడ్డ వాయనవల్ల. ఆ మహా మహుని వంశంలోనివారే మీ ప్రపితామహులు పరీక్షితుల వారు. వారు సునయనాంబికవల్ల భీమసేనుని గన్నారు. కుమారిభీమసేనుల కుమారుడు ప్రతిశ్రవణుడు. ఆయన

కన్నకొడుకు మీ తాత ప్రతీపసార్వభౌములు. ఆయన సిబి పుత్రిక సునందను పరిణయమైనారు. సునందాప్రతీప గర్భశుక్తిముక్తాఫలం మీ తండ్రిగారగు శంతన సామ్రాట్టులు. దేవనదీమతల్లి గంగాదేవివల్ల వారు మిమ్ములను గన్నారు. మీ చంద్రవంశం సాక్షాత్ గోక్షీరంవంటిది. హస్తిపురసింహాసనానికి ఏకైకవారసులు మీరు. మీ నాన్నగారి వెనుక రాజ్యమేలదగ్గవారు మీరు. పరమపవిత్ర కౌరవవంశజులచే పరిపాలింపబడిన భరతదేశానికి దాశకన్యాపుత్రుడు రాజు కాదగ్గ ఉపద్రవం యేమివచ్చింది బాబూ !?

దే: పొరపాటు తాతగారూ ! వంశంకర మయ్యేది బీజంగాని క్షేత్రంగాదు. సత్యవతీదేవి గర్భవాసాన జనించిన పుత్రులు శంతనరాజుబిడ్డలు కారా ? కౌరవవంశజులు కాకపోతారా ?

అం: ఊఁ .... నిజమే బాబూ !.... కాని .... కాని .... ఇప్పుడలా జరుగవలసిన అవసర మేమిటయ్యా ?

దే: పితృవాక్యపరిపాలనకొఱకు, నాన్నగారి అభీష్టసిద్ధికొఱకు.

క: పళ్లుగడిచిన సార్వభౌము లిందుకు సమ్మతిస్తారా ప్రభూ !?

దే: నేను సమ్మతిస్తే చాలుగదా ?

అం: బాబూ !?

క: అయితే....మీ అంత్యనిర్ధారణ యేమిటి ప్రభూ !?

దే: ఇప్పుడిదమిద్ధ మనలేను. దాశరాజును సంప్రతించి...

అం: బిడ్డా ! అది మీకే యెదురుపోటు సుమా. మీ గుండెలు మీరే గ్రుద్దుకొంటున్నారు.

దే : ఉఁహుఁహుఁ .. తాతగారూ! అనుభవమూర్తులు మీరే భీరువులై నీరస మాడవచ్చునా?

తన వెన్నుబెముకనే దానమ్ముజేసి మే
దినిని గాపాడె దధీచిమౌని
తన తల నొసగి మాటను నిల్పికొనినాడు
సత్యవ్రతుడు బలిచక్రవర్తి
తన మేనుగోసి యెత్తున కెత్తు నిడి త్యాగ
ధనుడయ్యె నల సిబి ధారుణిపతి
తన కన్నసుతుల నందరి గంగకిడుటోర్చె
న్యాయమ్ముకొఱకు మా నాన్నగారు
తనువు లెవ్వరికి నశాశ్వతములు ; నిల్చి
పోవు పరమార్థ మొక కీర్తిపో ; తదర్థ
మై యొనర్పంగ జెల్లదే త్యాగమొండు?
పితృ నభీష్టమ్ము దీర్పని సుతుడు సుతుడె? ॥

క : అయితే మీరు దాశరాజుకోరికనే తలదాల్చుతారా ప్రభూ!?

దే : ఏమవుతుందో చూదాం. నే నిప్పుడే దాసపల్లెకు తరలి పోతాను. సత్యవతమ్మను దర్శిస్తాను. దాశరాజును సంప్రతిస్తాను....ఏది అవసరమో అది చేస్తాను....వస్తాను తాతగారూ!

(నిష్క్రమించును)

అం : తొందరపడవద్దు. బాబూ!....యువరాజా! దేవవ్రతా!
(వెనుక నిష్క్రమించును)

క : వారి మతి మరల్చండి మహామంత్రిగారూ! ఎలాగైనా వెనుకకు తీసుకురండిస్వామీ! .... హృదయమా! జగన్నాథు డున్నాడు. జరుగదగ్గ విధానం జరిపిస్తాడు. నీవు భయపడి ప్రయోజనం లేదు.... శాంతించు. ఏమి కానున్నదో చూడు .... ఇంకేమిటి ? ఈ యోధమూర్తి యేమైనా చెయ్యగలరు. వీరి నిర్ణయా లప్రతిహతాలు. ఎంత సాహస మైనా చేస్తారు. తమ తండ్రిగారి కోర్కె తీర్చడానికై తాము తమరాజ్యమే త్యజించేస్తారేమో? అవును. ఆ దాశరాజు పేరాశ గలవాడు. తన మనుమడే రాజు గావాలన్న మాట మార్చుకోడు. దానిని కాదన రీ త్యాగరాజు.... పాపం! రాజ్యభ్రష్టులైపోతారుకాబోలు.... అంతే....అంతే అంత్యఫలితం అదే....అయితే అందుకు నీ వేమంటావు కల్యాణా!? నీ ప్రేమమూర్తి రాజ్యభ్రష్టులైతే నీవు సహించగలవా?....ఆ....కలవు...సహించగలవు. నీకు కావలిసింది రాజ్యభోజ్యాలుకాదు. ఈ వీరమూర్తి ప్రేమ....రాజ్య భ్రష్టులైనా....యే దుర్ఘటన గన్నవారైనా దేవవ్రతు లాయురారోగ్యవంతులై ఉంటే నీకు చాలు....వారే నీ పతి. నీ దైవం. నీ సర్వస్వం. నీకు వలసిన దా వ్యక్తి మాత్రమే.... ఆ ప్రేమమూర్తిమాత్రమే.

[ గౌరాంగుడు ప్రవేశించును ]

చూచారా స్వామీ!? యువరాజా వారు దాశరాజువద్దకు తరలిపోయారుసుమండీ.

గౌ : అలా గవుతుందని నే నెప్పుడో యెరుగుదునయ్యా!

క : నేను కలలోకూడా అలాగనుకోలేదు స్వామీ! దేవవ్రతుల వారు దాశరాజును తీవ్రంగా గర్హిస్తారనుకొన్నాను. తనకే ముప్పు తలపెట్టినందుకు కఠినంగా దండిస్తారనుకొన్నాను. ఇంత వయసు వచ్చి యీ వలపు తగదని తండ్రిగారిని దద్దరిస్తారనుకొన్నాను.... కాని.... కాని.... చాలా చిత్రం స్వామీ! మంచుగడ్డకంటే చల్లబడిపోయారు యువసార్వభౌములు. ఆ వీర్యవిక్రమా లేమైనవో—ఆ యోధాద్ధత్యం యెటు మాయమయిందో — ఆ ఉగ్రకోపతత్వ మెలా ఉడిగిపోయిందో స్వామీ! గంగిగోవులా కదులలేదు మెదలలేదు. మేరుగిరిలా ధీరులై స్థిరంగా నిలువబడ్డారు. శాంతమూర్తిగా సాక్షాత్కరించారు. తండ్రిగారి కోరిక తీరుస్తారట. దాశరాజు మాటతప్పకపోతే తాము రాజ్యమే త్యాగం జేసేలా గున్నారు స్వామీ!

గా : త్యాగం జేస్తాడయ్యా! చేస్తాడు. త్యాగం జెయ్యడం యీ వంశానికి మంచినీళ్లుత్రాగడమే .... అంతేగాదు కల్యాణా!

> గొట్టివెనుక గొట్టి గ్రుడ్డిగా పోవును
> గొప్ప తగులుకొన్న గోత బడిన;
> తండ్రి సప్తసుతుల త్యాగమ్ము జేసెను;
> తక్కువేమి చేయు తనయుడైన?॥

క : తనయు డేమి చేయగలరు స్వామీ!? తండ్రిగారికి కొంచెం ధర్మచింత వద్దా? అవునులెండి. ఇల్లా లేడుగురు కొడుకుల నేటగలిపితే సహించిన శంతన సార్వభౌములు యువరాజా

వారి క్షేమ మూహించగలరా ?....స్వామీ ! తల నెరసి పోయినా వీరికి వలపు వాడిపోలేదు.

గా : వాడిపోవటానికి వలపనేది వంకాయవరుగా, అంటి సొరుగా కల్యాణా ?

వలపు పుట్టకుండవలెగాని పుట్టిన
వలపు గిట్టుటన్న వట్టి కల్ల ;
నిశలు పవలు మండు దశకంతు కాష్ఠమై ;
ఆరిపోని యగ్గి యది సుమయ్య !॥

కల్యాణా ! నీవు కన్నెపిల్లాడివి. వలపురోగం నీలో వ్యాపించిందో లేదో. ఆ తాపంలో తగులబడేకొద్దీ మరింత తగులబెట్టి మహాగ్నిలా మండిపోతుంది. అయినా పంచదార పాకంలా దాన్నే ఆపోసనపడతాడు ప్రతివాడూ. ఆ బాధ పండగ. ఆ తాపం మంచిగంధపు పూత. ఆ జాడ్యం సహజాలంకారం. అది లేనిమనిషి మనిషేకాదనుకో. ....అయితే....కల్యాణా ! నీకుకూడా ఆ కళ సోకినట్టే ఉన్నది సుమా.

క : ఏమో స్వామీ ! అనుభవసిద్ధులు మీరే చెప్పండి.

గా : నా కంటికి నీ ముఖంలో బాగా కనుపిస్తున్నదా కళ.

క : ఎలాటికళ స్వామీ ! ?

గా : ఆ కళకు అనేక రూపాలు. దేనిపైన నీ వలపో తెలియపరిచే వంతే ఆ కళ యెలాంటిదో ఘంటాపథంగా చెబుతాను... వివరాలు చెప్పు .... ఎవరినైనా ప్రేమిస్తున్నావా అసలు ?

క : ఆ.

గా : ఓహో ! ఎవరిని పెళ్లాడతావైతే ?

క : అది తెలియదు స్వామీ ! ... అది మీరే నిర్ణయించాలి.

గా : సరి సరి. గౌరాంగుడు కల్యాణచరిత్రాధికారైతే యింకేం ఉంది ? కనకాంబరాలు కావిచీరలు. చెంపగొలుసులు జేగురు జడలు. తారహారాలు రుద్రాక్షపేరులు. అంతః పురాలు అరణ్యభూములు .... అంతే.

క : మీకు బ్రహ్మచర్యంపైన వలపా స్వామీ !?

గా : ఔనౌను. మాయసంసారాలకంటే కఠోర బ్రహ్మచర్యమే మధురం గాదటయ్యా !?

క : అందుకనే మీరు బ్రహ్మచర్యాశ్రమం ప్రబోధిస్తుంటారు స్వామీ ! .... అయితే మాకుకూడా అదే మంచిదేమో.

గా : మంచిదే మామీ ! ఇనపకచ్చడాలు ఘడియ ఘడియకీ విడిచెయ్యనినాడు, చెయ్యిగాల్చుకోవటం చేతనయిననాడు, ప్రసూనబాణుడు మీద పడనినాడు, అడవుల్లో భీకరదృశ్యాలకు హడలిపోనినాడు, బ్రహ్మచర్యం భళీ అనదగ్గదేనయ్యా!

క : ఇంతేనా ?

గా : కాదు కాదోయ్. ఇంకా ఉన్నది .... పంచప్రాణాలూ బిగబట్టాలి. మనస్సు ప్రమానుచేసుకోవాలి. బుఱ్ఱ బోడిది కావాలి. తామ్రాలు తగిలించుకొని అక్షయపాత్రపెట్టి అడుక్కోవాలి. దర్భలూ రుద్రాక్షలూ ధరించాలి...ఇంకా దేవుడు చాలా మేలుజేస్తే...

క : అబ్బబ్బా ! ఇవన్నీ కష్టమే స్వామీ !

గా : అన్నావూ ? కష్టమన్నావూ ? అయితే బ్రహ్మచర్యాం నీకు పట్టువడదు.

క : పోనీ గార్హస్థ్యమో స్వామీ ! ?

గా : ఆడదానివో మగాడివో అంతుపట్టకుండా ఉన్నావే.... సంసారానికిమాత్రం యెలా సరిపోతావు ? ... అదేఁవిటీ ? రాజావారిలా వస్తున్నారు.

క : హడావిడిగా వస్తున్నారు స్వామీ !....ఏఁవిటో ?

[ శంతనమహారాజు ప్రవేశించును ]

శం : నిజమా కల్యాణా ! ? నిజమా ?

క : ఏఁవిటి ప్రభూ ! ?

శం : దేవవ్రతుడు ... దాసపల్లెకు వెళ్లేడా ?

క : అవును ప్రభూ ! మహామంత్రిగారుకూడా వెళ్లేరు.

శం : అయ్యయ్యో ! ఎందుకు పోనిచ్చారయ్యా అక్కడికి ?

గా : తండ్రిగారి విరహతాపం ఆపడానికి పోయాడు.

శం : ఇది మా తాపం ఆపటంగాదు. కుమారునికి మారణ హోమం.

గా : దానికి తమరే హోతలేమో.

శం : అవునవును. ఈ హోమానికి మేమే హోతల మయ్యాం.

కాకున్నన్ ముదిముచ్చు ముంగరలకుం
గామేశ్వరీమంత్రమా ?
మా కీ పెద్దతనమ్ములోన వలపా ?
మర్యాద శృంగారమా ?
యీ కాలమ్మున తాళిగట్టుదుమ వే
రేకన్య కంఠానికో ?
భూకంపమ్ములు పుట్టవా ? ఉఱలి య
బ్ధుల్ పొంగవా నింగికిన్ ? ॥

గౌ : అయిన దాని కల్ల రెందు కల్లుడుగారూ ! ?

శం : హాస్యాల కిప్పు డనువుకాదు గౌరాంగా ! ఆలస్యమయితే కాలం హాలాహలమైపోగలదు. అబ్బాయి యిప్పు డేమి చేస్తాడో ? స్మశాన సందర్శన సన్నాహంలో నున్న మా కోసం చిరంజీవి జీవితం చిందరవందర కాకూడదు..... రా పోదాం.

గౌ : ఎక్కడికండీ ! ?

శం : దేవవ్రతుని వెనుకకు తీసుకురావాలి....రా రావయ్యా !

( నిష్క్రమించును )

గౌ : ఉహుఁహుఁ....చూచావా కల్యాణా !

ఆరిపోయెను గొంతు దాహమ్ముతోడ ;
ఇపుడు నీళ్ళకు కాల్వ త్రవ్వించు నితడు ;
శవమునకు వేయజూచు నౌషధము జడుడు ;
పిప్పిలోన రసమ్ములు పిండనగునె ? ॥

క : నిజమే స్వామీ ? ... కాని, రాజావారు రమ్మంటున్నారు. వెళ్ళండి. యువరాజావారి కవగతి తప్పించండి.

గా : ...ఊఁ....చూదాం.

( నిష్క్రమించును )

క : ఊఁ .... ఈ రాజావారి కిప్పటికి జ్ఞానోదయ మయింది. ఇప్పుడు పోతున్నారు. ఏమిచేయగలరో ! ఏమవుతుందో ! పరమేశ్వరు డేమి నిర్ణయించాడో !

హృదయమా ! నీకు తొందర యేల ? శాంతి
గొనుమ ; భయ మందబోకుమా ; కనుల నీరు
వెట్టకుమ ; నీదు జీవనవిధి విధించి
యుండు నింతకుమున్నె యీశుండు నుదుట ॥

( నిష్క్రమించును )

( తెర పడును )

# చతుర్థాంకము

## 1-వ రంగము

## దాసపల్లెలో దాశరాజు గృహము

[ రంగరాజు సత్యవతి మాటలాడుచుందురు ]

రం: కాదే లప్పా!....అవునే....కాదే.

స: ఏఁవిట్రా?

రం: అదేనే...నాకు తెల్లేదే....మారాజుగారే....అలా సూశా రేంటే నీవంక?

స: ఎలా చూచారు?

రం: పిచ్చోళ్ళాగు సూళ్ళేదంటే? బాబుతోటి మాటాడతున్నా నీవంకే సూత్తారు. అమ్మతోటి మాటాడతున్నా నీవంకే సూత్తారు. నాతోటి మాటాడతున్నా నీవంకే సూత్తారు.... ఎందుకే అలా సూత్తారు?

స: ఏమో .... ఎందుకుచూచారో నాకేఁవి తెలుసునురా?.... నేను చూడలేదుగా?

రం: అమ్మతోడే లప్పా!...నువ్వా సూశావే అర్ని. నేను మిమ్మల్ని సూత్తున్నా గాదంటే? ఆ రలా ఆవైపుకి సూత్తున్నారనుకో. నువ్విలా సూత్తా వారొంక. ఆ రిలా నీ వైపుకి సూశారనుకో. నువ్వలా గమ్మని వాల్చేత్తావు కళ్లు. ఆ రలాక్కాదే లప్పా! నువ్వారొంక సూసినా నీవొంక సూత్తారు. ఆరొంక నువ్వు సూడకపోయినా నీ వొంక సూత్తారు. అలాగలాగ నిన్ను సూత్తానేవుంటారే మరేంటో గాని ... ఎందుకే లప్పా! నిన్నేకొరస నలా సూత్తారు?

స: ఉహుఁహుఁ .... నిన్ను చూచినట్లే నన్ను చూచి ఉంటారు.

రం: అబ్బబ్బే. కాదే లప్పా! అమ్మొంకా అయ్యొంకా సూత్తే అదోమోత్తరు.

స: మరి .... నీవంక యెలా చూచారు?

రం: నావొంక సూసి పక్లికిలించి యేంటో యెక్కిరింతారే.

స: నావంక?

రం: నీ వొం కెలా సూత్తారంటే .... మరిగంటే .... మనం యేఁవన్నా తింటుంటే మనెట్టికుక్క మనొం కెలా సూత్తది? అలాగు. ఆటమరిగి లట్టుకుంటాకి కొం గెలా దొంగసూపులు సూత్తది? అలాగే.

స: పోర్రా.

రం: పోతా.

(నిష్క్రమింపబోవును)

స: రంగా! రంగా!

రం: (వెనుకకు తిరిగి) ఏం?

స: పోతున్నావేవిరా?

రం: పొమ్మన్నావు గాదంటే మరి? అందుకు పోతున్నాను.

స: ఎక్కడికి?

రం: ఎక్కడికి? ఎక్కడికి పోతున్నాను? .... నువ్వెక్కడికి పోమ్మన్నావే?

స: నిన్ను నిజంగా పొమ్మనలేదురా.

రం: ఊం? మరేంటే? ఆచ్చికానికన్నావా?

స: ఊం....నీవు....మహారాజావారిని మరీ నీచంగా పోలిస్తేను..

రం: నీసింగా పోల్సలేదే లప్పా!....నిజం సెప్పేనే.

స: నీవు మరీనురా....నీ కంటికి వారు కొంగలాగూ కుక్క లాగూ కనుపించారట్రా?

రం: ఆరుకాదే. అరి సూపే. అరికేంవేం?

స: వా రెలాగున్నారంటావు రంగా?

రం: ఆరా? ఆరా?...ఆరికేంవేం?...ఆయేల...నేను....యేసం వేసుకుంటే యెలాగున్నాను? అలాగున్నారే..కాదంటే.. కిరీటకం సరింగా లేదే. యేంటో రాళ్లూ పొళ్లూతో టికారం గుందే. నా లాగ నెత్తిమీద నెంవిలీకి లెట్టుకుంటే నిండు గుండునే.

స: ఉఁహుఁహుఁ...ఆ ముఖం...అందంగా లేదట్రా?

రం: అందం...అందంగుందిగాని...సాయి తక్కువే.

స: ఆఁ?...ఆఖాయ కేఁవిరా? దబ్బపండు. పదారువన్నె బంగారం....ఒరే రంగా! ఆ ముక్కూ ఆ కన్నులూ.... యెంత అందమైనవిరా?

రం: నిజిం నిజింవే. ఆల్చిప్పలంటి కళ్లే. గెద్దగోర్లాంటి ముక్కే. సిన్న సిన్న సక్కిళాయి లొాసువంటి సెవులే. కందిరీగ కంటంపీకే....ఆ జుట్టు...జుట్టు....

స: జుట్టుకూడా యెంత సుందరమైనదిరా? తెరలు తెరలుగా తెల్లజారలుంటేమాత్రం యేమి? చక్కగా వంకరలు తిరిగి మెడమీద జాలువారి సయ్యాటలాడే ఆ జుట్టు...

రం: యెనకజుట్టికారంగుందే. నాలాగ సెంపజునపా లేసుకుంటే, కాకపచ్చా ెట్టుకుంటే గమ్మత్తుగుండకపోనంటే?

స: ఊఁహుఁహుఁ....మనం పల్లెటూరివాళ్లం. వారు పెద్ద పట్నవాసులురా. మనం పేదవాళ్లం. వారు మహారాజులురా. కాకపక్షాలు వారికి నాగరికత కాదురా. ఉంగరాలు తిరిగిన వెనుకజుట్టు వారికి చాలా శృంగారంరా....ఒరే తమ్ముడూ! చంద్రబింబంతో సరిసమానమైన ఆ సుందరముఖం...ఆదిలక్ష్మి కాస్థానసీమ కాదగ్గ పీన విశాల వక్షస్థలం...ఆ సింహేంద్ర మధ్యం...ఆ సిరిగల పాదాలు...ఆహాహా! ఆహాహా!

(తన్మయురాలగును)

రం: అయ్యెబా బదేంటే లప్పా!?....అలాగైపోయావేంటే?

స: ఏఁవిటి రంగా!?

రం: ఆయి ఆయి మంటా కొామ్మారిసేశావేంటో!

స : అవునురంగా ! ఆ ఆలోచనలో యేదో అవ్యక్తానందం. ఆ మాటల్లో యేదో మహత్తరసౌఖ్యం.

రం : ఏంటే బాబూ !? ఒకపెడ ఆనందం వంటావు. ఉంకో వైపు నేడుత్తావు. ఈ పక్కని సౌక్కెం వంటావు. ఆ పక్క ఉస్సురని ఊపిరిదీత్తావు. కూంచేపు పండుగొప్పలాగు కుల కుల మని కులికేత్తావు. కాంచేపు గాళుపుదెబ్బతిన్న బొచ్చి సేపలాగ తెప్పుని తేలబడిపోతావు. యెండలేదు. ఓనలేదు. ఆకలనవు. అన్నం తినవు. నిన్నుసూత్తే సోద్దింగుందే యేటో. యెందుకే యిలా గుంటావు ? నీ కేం గావాలో నాతోటి సెప్పే.

స : నీ వేమి చెయ్యగలవు బాబూ ! ?

> నుదుటిమీది వ్రాత కదుపగా తరమౌనె
> శూలికైన తమ్మిచూలికైన ?
> సత్యమనసులోని సంకల్ప మీడేర్ప
> చిరుతమానవులకు తరమె రంగ ! ? ॥

రం : అలా గనకే సత్తెక్కా ! నీ రంగన్న సెత్తి నీకు తెల్దే. నీ కేది గావాలంటే అది సేత్తాడే. సిద్దంగున్నాడే, సెప్పే.

స : ఉఁహుఁఁహుఁ.

రం : నవ్వేసెయ్యికే లప్పా ! ఒట్టే. సోప్పే, సోరగంలోకెల్లి సోరకాయిలు తెమ్మంటావా ? సంవుద్రంవంతా యీది సావిడాయిలు తేనా ? సెట్లన్నీ సోదించి సిలకగోరికిన జేంపళ్లు సేటి డట్రానా ? బాయ్యగార్ని సెయ్యట్టుకుని బఱబఱా లాక్కు రమ్మంటావా ?

స: ఊఁ .... బావయ్యగారు! వారి నలా పిలవటానికి మన మర్యాలం గాము రంగా!

రం: యేం? యెందుక్కాదే?

స: ఆ యోగం అంతరించింది బాబూ!

రం: నిరాసిపడి నీరై పోతావెందుకే లప్పా!?

స: నిరాశ గాక మరేమున్నది రంగా!?

అపటి యుద్రేకమో హాస్యమో గాని మ
హారాజు సతిగ న న్నాసగొనునె
ఆశించెనో ద్విజునంపు నొక్కనిగాని
అరుదెంచునే బేరమాడ తానె
వచ్చెనో హాస్యంపు పలుకులుగా తలం
పక తండ్రి నమ్మునే పలికినంత
నమ్మెనో చటుకున సమ్మతించునుగాని
గొంతెమ్మకోరికల్ గోరికొనునె

జ్యేష్ఠసుతుని రాజ్యభ్రష్టు జేయు చెనటి
రాజు లెందేని గలరె? యవ్యాజమాన
శూరు డా రాజపుత్రకు దూరకొనునె?
కానిచో సత్యవతి కింత కలిమి యగునె? ॥

( తెరలో )

దాశ తాతా! దాశ తాతా!

రం: యెవ రా బొంగురుగొంతుకు?

స: ఎవరో...పోయి చూచిరా రంగా!

రం : సూసొత్తానుండు.

(నిష్క్రమించును)

స : నా చరిత్రతో సయ్యాటలాడుతున్న చిత్ర చిత్ర సన్ని వేశాల్లో యిదొకటా ప్రభూ! యమునాతరంగిణి చెలమ గోతిని చేరబోయిందా? ఆ మహానదిని చెలమగట్టే చేరనీయ నన్నదా? మేరుపర్వతం దగ్గరికి చేరినదా? మిణుగురుపురుగా మహాసత్వాన్ని వెనుకకు మీటినదా?....అవునవును. అలా జరుగవలసిందే. అది ధర్మమే...వారు భరతవంశాగ్రణులు. భారతసార్వభౌములు. సత్యవతి పల్లెపడుచు. ఈ సమాగమం సవ్యంగాదు. అందుకే విధి వ్యతిరేకించింది. ధర్మదేవత దాశరాజురూపంలో అక్రమప్రవాహాన్నడ్డికొన్నది. దాశరాజుకోరిక నెపం. ఆ నెపం వెనుక నిలిచినది మాత్రం విధి...అంతే...అంతే.

నెపము మనుజమాత్రునికి జెందునేగాని
విధి శిరమ్ము నంటవెరచు నెపుడు ;
మానవులకు జరుగు మంచికి చెడ్డకు
ప్రథమకారణమ్ము విధి యొకండె ॥

[రంగరాజు హడావిడిగా ప్రవేశించును]

రం : లప్పా! .... లప్పా!

(వగర్చును)

స : ఏం రంగా!? .... ఏఁవిటది? .... అలాగున్నావేం?

రం : అదేనే .... అదే .... అదే.

స : ఏఁమిట్రా అది ?

రం : ఆరే ... ఆరంటే ....

స : ఎవర్రా ?

రం : ఎవరవు నువ్వు అన్నానే. మాటాడ్డే. యే వూరు నీది అన్నానే. ఊరుకొన్నాడే. యెందుకొచ్చావు అన్నానే. యేదీ సొప్పడే. యేం గావాలి అన్నానే. నువ్వు గావా లంటాడే.

స : నేను కావాలన్నాడా ?

రం : అవునే. సత్తోత మ్మెక్కడుంది ? నాకు సూయించు సూయించని కూడామడ్డాడే.

స : ఎవరురా ?

రం : యేమోనే, తాడిసెట్టం తెత్తున్నాడే. మీదడబోయీ మెకంలాగున్నాడే. కొండగుట్టల్లా గున్నయ్యే గుండిలు. కళ్లల్లో రత్తం కాటికెట్టుకున్నాడు గామోసే, సింత నుప్పుల్లా గున్నయ్యే .... ఆరుగోనే వొత్తున్నారే.

స : ఎవరు చెపుమా ?....యువరాజావారు కాదుకదా !

[ దేవవ్రతుడు ప్రవేశించును ]

దే : అమ్మా ! సత్యవతీదేవి మీరేనా ?

స : అవును బాబూ !....నన్నే....నన్నే సత్యవ తంటారు.

దే : నమస్కారమమ్మా ! నమస్కారం.

స: చల్లగా వర్ధిల్లండి బాబూ!

దే: ఆహాహా! ఎంత దయగా దీవించారమ్మా! ఎంతచల్లగా ఉన్నదమ్మా! ఎన్నాళ్లకు అమ్మదీవన అందుకొనే అదృష్టం కలిగినదమ్మా!

(పరవశుడగును)

స: బాబూ! ... మీరు... ?... మీరు ... ?

దే: నేనేనమ్మా!...మీ బిడ్డనమ్మా! ఏడుగురు జ్యేష్ఠసోదరు లేట గలసిపోవటంతో యేకాకినై కనిష్ఠసోదరులకోసం కలవాచి యున్నవాడనమ్మా! బాల్యమందే కన్నతల్లి యెడబాసి పోవటంతో తల్లిప్రేమ గోరి తహ తహ లాడుతున్నవాడ నమ్మా! పితృవాక్యపరిపాలనార్థం యేత్యాగం చేయటానికైనా సిద్ధమై యున్నవాడనమ్మా! శంతనసార్వభౌముల ఔరసపుత్రుడనమ్మా! గాంగేయుడనమ్మా! నన్ను దేవవ్రతు డంటారమ్మా!

స: మీరా బాబూ?....మీరా?

దే: అవునమ్మా నేనే. పరిస్థితులన్నీ బాగా అర్థంచేసికొన్నానమ్మా! కని పెంచిన నాన్నగారి కామితార్థ మీడేర్చుతానమ్మా! మీ బిడ్డను కావాలని వచ్చానమ్మా! చల్లని మీ తల్లిప్రేమ శాశ్వతం జేసికోగోరుతున్నానమ్మా! అమృతోపమమైన మీ ఆదరణ అభిలషిస్తున్నానమ్మా! ఆదిలక్ష్మికి ప్రతిరూపమైన మిమ్ములను 'అమ్మా!' అని పిల్చుకొనే అదృష్ట మాశిస్తున్నానమ్మా?

స : క్షమించండి బాబూ ! నే నెన్నడూ మీ కన్యాయం కోరలేదు. కోరను.

దే : మీ అమృతహృదయంలో అక్రమహాలాహాలం పుట్టదమ్మా! దీనిలో దాశతాతమాత్రం తప్పేమి చేశాడమ్మా !?

స : మా తండ్రికైనా రాజద్రోహచింత లేదుబాబూ !
అతడు ముదుసలి ; బుద్ధిమాంద్యమ్మె ప్రథమ
కారణము వాని విపరీతకామ్యమునకు ;
కూతు నున్నతి గన బెంచికొన్న కలలు
మరియు గనుగప్పె; నింతప్రమాద మయ్యె ॥

దే : ఇప్పుడు ప్రమాద మేమీ రాలేదు తల్లీ ! నా కెవరిమీదా కోపం లేదు. సమస్తమూ సవ్యంగా సమాప్తమౌతవి....
దాశతాతను పిలిపించమ్మా !

రం : నేను తీసుకొస్తాను బాబుని.

( నిష్క్రమించును )

స : యువరాజా !

దే : వద్దు వద్దమ్మా ! మీకు నేను యువరాజును కాదమ్మా !
రాజరాజైన నెంత యుగ్రమావులైన
బిడ్డ తల్లులకుం జిన్నబిడ్డడమ్మ ! ;
అమ్మ ! యని మిమ్ము నేను నోరార బిలుతు ;
బిడ్డ ! యని నన్ను ప్రేమతో పిలువుమమ్మ ॥

స : మీచేత 'అమ్మా' అని పిలిపించుకొనే అదృష్టం యీ అభాగ్యురాలికి లేదుబాబూ ! ఆజన్మమరణపర్యంతం బ్రహ్మచారిణి

నైనా కాగలనుగాని అన్యాయాని కొడిగట్టజాలను. మరణమైనా మంచిదంటానుగాని పూర్వాచారవ్యవహారాలు బూది గలుపలేను. రాజకీయాలను రాళ్లపాలుజేసి రౌరవనరక మనుభవింప గోరను. మాసిపోని మచ్చగల ముఖంతో స్వేచ్ఛాజీవనం జెయ్యనోపను. అన్నెం పున్నె మెరుగని ఆయుష్మంతులు దేవవ్రతుల క్రమం సహించను. మీ యమాయిక నిశ్చయం నా కర్థమయింది. ధర్మవిరుద్ధం తలపెట్టకండి. తిరిగి వెళ్లిపొండి బాబూ!

దే: ఉఁహుఁహుఁ.... కానిభయాలతో కలతపడిపోవద్దమ్మా!

[దాశరాజూ, మాతంగీ ప్రవేశింతురు]

దా: నమత్తు బాబూ!....నమత్తు.

మా: దణ్ణం బాబయ్యా! దణ్ణం.

దే: దాశతాతా! మనుమగుఱ్ఱకు తాతయ్య దణ్ణంపెట్టవచ్చా?

దా: లేదు బాబుగారూ!....కాదు.

పెద్దలంటె యెవరు? పిన్నవోరెవ్వరు?
బుద్ధియే గదయ్య! పెద్ద పిన్న;
తఁవకు దణ్ణం వన్న తఁవ సెరీశానికా?
మనిసి ఆత్వఁకే నమత్తు బాబు!॥

దే: ఆ వేదాంతం నాకు తెలియదుగాని, తాతా! మీబోటి పెద్దలు మావంటిపిల్లలను దీవించాలి. మీరు నమస్కారం చేస్తే మా కాయుక్షీణం తాతా!

దా : అలాగే బాబుగారూ !...అలాగే.

మా : యెంత మంచిమారాజులు బాబయ్యగారూ ! మీరు !

దా : దేవరతులోరంటే దేవుడుగాదంటే !

మా : కాకపోతే యీపాటికి నువ్వు జేసిన గాతకి మనల్ని కాల్చెయ్యకపోదురా ?

దే : కాదు మామ్మా ! తాత యేఘాతా చెయ్యలేదు.

మా : గాత కాకేంటి బాబయ్యా !? అంతయ్యగారు మా సత్తెమ్మని పెళ్ళాడతా నంటంవేంటి ? యీ పేదోళ్ళంటికి సొయింగా దయిసెయ్యటంవేంటి ? పిల్లనిచ్చి పెళ్లిసెయ్యి వియ్యా అని యీన్ని పేర్దింతం వేంటి? యీ దుట్టుపోడు దురాశేంటి బాబయ్యా !? సీరమేనుకి మేరుగొండని బేరం వాడతాడా బాబయ్యా !?

దా : ఆరోజునుంచీ యీళ్ళందరూ న న్నిలా గాడిపోసు కుంటున్నారు బాబయ్యా ! అడుక్కోమని అతికారులంటే నా ఆప్పాయిం సొప్పేనుగాని యిదే కావాలని యిద్దం సేశానా బాబయ్యా !? దొరలు మీ తోవ కడ్డేవుంది ? మీ సిత్తం వెలాగైతే అలాసెయ్యండి బాబయ్యా !

దే : ఉహుఁహుఁ...కత్తిచూపి కన్యను గొనిపోటానికి రాలేదు తాతా !

తాతవు ; నీదు వాంఛిత మధర్మముకానిది ; నేడు కన్యకా
దాతవు ; నీదు కోరికలు తప్పక తీరుపదగ్గవయ్యా !; నా
చేత గలట్టి కార్య మది ; సేయుదు సుంతయు శంకలేక ; నీ
చేతము సంతసించిననె చేకురు మాకు శుభ మ్మనంతమై.

స: బాబూ! బాబూ!

దే: మీకు నమస్కారమమ్మా! మీ రూరకుండాలి...విన వయ్యా దాశతాతా!

ఈమె మా యమ్మ; బ్రహ్మ లిఖించె నటుల;
తల్లి కఱవైన నన్ను నీ తల్లి పెంచు;
తమ్ముల నొసంగి నా యొంటితనము దీర్చు;
అమ్మనుం జేసికొందు నీ యమ్మ నేను॥

స: బాబూ! మీ గుండెలు మీరే గ్రుద్దికొంటున్నారు. ఈ అక్రమానికి నేను హర్షించను.... నేను.... నేను...

దే: అమ్మా! మీ రిప్పుడు పెండ్లికుమార్తెమాత్రమేనమ్మా! పెండ్లికుమార్తె తలవంచి కూర్చుండవలసిందేనమ్మా! దాశతాతే యీ విషయంలో మనకందరికీ మార్గదర్శకుడు కాగలడమ్మా! మీరు కలతపడకండి తల్లీ!... దాశతాతా! నీవు మహానుభావుడవయ్యా!

తాత! నీ కెంత నాపై నుదాత్తకరుణ!
ప్రభుని తలబండలగు రాజ్యభారములను
పెద్దమనుమని కీవు తప్పించినావు;
నెమ్మి చేయుదు నభివందనమ్ము గొమ్ము॥

దా: బాబయ్యా! బాబయ్యా! నా కేంటో బయింగుందండి.

దే: నీ కేమీ భయంలేదు తాతా! సావధానంగా విని సంతోషించవయ్యా!

శాంత స్వాంతముతోడ జేతును ప్రతి
జ్ఞన్ ; సర్వు లాలింపు డా
శాంతప్రాంతము గల్గు మాదు ప్రజలా
రా ! హస్తి సామ్రాజ్యరా
ట్కాంతుల్ సాత్యవతేయు లీ నృపుని వె
న్కన్ ; వారు పాలింతు ర
శ్రాంతమ్మం దయతోడ నీ భువిని వం
శానుక్రమ మ్మొప్పగన్ ॥

హరిహరులు సాక్షి ; పైన నా యాత్మసాక్షి ;
యిపుడె త్రికరణశుద్ధిగా నెల్ల రాజ్య
రమను త్యజియించికొంటిని మమత విడచి ;
కోరను మఱెన్న డెంతనిష్ఠూరమైన ॥

స : ఎంత భీష్మం ! ... ఎంత భీష్మప్రతిజ్ఞ ! .... బాబూ ! .....
బాబూ ! .... ఏంవిటీ అన్యాయం ?

దే : అన్యాయం యేమున్నదమ్మా ! ? నే నెవరు ? నా
తమ్ములెవరు ? ఒక్కతండ్రిబిడ్డలమే కాదటమ్మా ! ? నా
తమ్ములు రాజ్యమేలటం నే నేలటం గాదటమ్మా ! ?

స : తన్ను మాలినధర్మమా బాబూ ! ? సవతితమ్ముల
కోసం మీ తలనే త్యాగం జేస్తారా బాబూ ! ? కాబోయే
పల్లెపడుచు కల్యాణంకోసం పట్టాభిషిక్తులై యున్న
ప్రభుకుమారులు రాజ్యభ్రష్టులై పోతారా బాబూ ! ? ....
ఈ ధర్మసాంకర్యానికి నా తల గురిచేస్తారా బాబూ ! ?....
కాదు....కాదు. ఆ అత్యాచారం ఆపవలసిందే. నాకోసం

నేను మీకు రాకాసిని కాలేను...క్షమించండి బాబూ!...
నాకు...నాకు పెండ్లే వద్దు.

దే: అమ్మా! ... అమ్మా!

స: అవును బాబూ! అనర్థాలన్నిటికీ ఆలవాలమైపోయింది
నా కల్యాణసమస్య. నే నెందుకు పెండ్లి చేసికోవాలి?
ఇన్ని అపస్థితు లెందుకు కల్పించాలి?

దే: మీ కల్యాణం సార్వభౌముల పవిత్రప్రేమ సఫలం చెయ్యా
డానికమ్మా!

స: సార్వభౌముల ప్రేమకోసం యువసార్వభౌములను
స్వాహాచెయ్యనా బాబూ!?

దే: అది సార్వభౌముల కోరిక కాదమ్మా!

స: కాని జరిగిన దదే బాబూ! అందుకు ప్రతిక్రియ నేను
బ్రహ్మచారిణిని కావటమే.

దే: ఉఁహుఁహుఁ....పిచ్చితల్లీ! మీ నిర్ణయానికి సమయం
దాటిపోయిందమ్మా!

స: ఏం బాబూ!?

దే: అవునమ్మా! మీ రిప్పుడు బ్రహ్మచారిణులైతేమాత్రం దేవ
వ్రతుడు త్యజించిన రాజ్యాన్ని మరలా స్వీకరిస్తాడటమ్మా!?

భూమిచక్రమ్ము మింటికి పోవుగాక!
మిన్ను భూమిం బడునుగాక! మిహిరచంద్రు
లంతరింతురుగాక! గంగాత్మజుండు
చేసిన ప్రతిజ్ఞకున్ మార్పు చెందగలదె?॥

వద్దుతల్లీ ! మీ రిప్పు డితరనిర్ణయా లేవీ తీసికోవద్దు. మీరు ధర్మప్రభువులైన నాన్నగారిని వివాహమై ఆదర్శ ధర్మ పత్ని గావలిసిందే. నా ప్రతిజ్ఞ ఆచంద్రతారార్కం చిర స్థాయి నందికోదగ్గదే...ఇందుకు తప్పవద్దమ్మా ! నాపైన ఒట్టమ్మా !

స : బాబూ !...బాబూ !...

( గుటులుకొని యేడ్చుచూ నిష్క్రమించును )

మా : ఊః...సివరి కెంతన్నా యిం సేశావయ్యా దాశయ్యా !? నీ శిరుసు సితికన్నా పోలేదయ్యా !

( దాశరాజుపైన మెటికలు విరిచి పోవును )

దా : (విచారముతో) యిం తవుద్దని కల్లోగూడా కానలేదు బాబయ్యా !...అమ్మ అందఁవే నా ఆసిగాని తఁవరిని దగా సెయ్యటం నా తలుపుగాదు తండీ !

దే : నీ వేమీ దగా చెయ్యలేదులే తాతా !

దా : కాదు బాబుగారూ !

సెడ్డసేతులార సిది పేను గుడ్డుని ;
సిచ్చుబెట్టినాను పచ్చనింట ;
నలుగురున్న నావ నడియేట ముంచాను ;
నరకమొచ్చునేమొ నాకు తండి !॥

( తెరలో )

తొందర సెందవద్దుసుమ
తోయజవైరికులాగ్రరత్నమా !

ముందర నీకు నెంతయును
ము ప్పిది; పాప మెరుంగ లేదు నీ
డెందము; తగ్గ యోచన ఘ
టింతము; వచ్చుచునుంటి నేను; మే
మిందర ముండి మిమ్ము గన
నీ మపకారము రాజనందనా! ॥

దే: .... పాపం! ప్రధానిగారు.

దా: పెతానిగారా బాబయ్యా!?

దే: అవును తాతా! వారికింకా పూర్వాభిప్రాయం పోలేదు.

దా: ఆరేకాదు బాబయ్యా! యేరికైనా మీ మీ దీసు లేదు. నాక్కూడా మీ కన్నాయిం జరగటం నరనరాలా బాదిత్తుంద మణుసు మారుసుకోండి బాబయ్యా! నేను కోరినార నేనూ కూడ దీసుకుంటాను.

దే: గాంగేయుడు గాలిపటమా తాతా!?

దా: అయ్యొబాబయ్యొబాబోయ్! యెలాగ బాబయ్యా!? యేళ్ల మీద బందం కాళ్లకేసుకున్నాగందా దొరా!... యెరక్కపోయాను ... అరుగో! బాబయ్యా! మంతిరిగా రొత్తున్నారు. నన్ను మట్టిలో గలిపేత్తారుగా మోసు.

దే: రానీ తాతా! నీ కేమీ భయం లేదు...కాని...తాతా! నీ కోరిక తీరినట్లేగదా! నీ వీ వివాహానికి సమ్మతించినట్లే గదా?

దా: యేంటో బాబయ్యా! నాసిత్తవంతా సీకటిలా గుందిప్పుడు. ఆలోయించుకోనీండి బాబయ్యా!

దే : సరే తాతా! బాగా ఆలోచించుకో. రేపటి సాయంకాలం వరకూ నీకు గడువు. యమునానదివద్ద గుడారంలో ఉంటా మంతవరకూ. మళ్లా వస్తాము. అప్పుడు నీ ఆఖరిమాట చెప్పు తాతా !

దా : సిత్తం, సిత్తం.

( ఆలోచించుచూ నిష్క్రమించును )

[ అంశుమంతుడు ప్రవేశించును ]

అం : ఏం బాబూ !? శపథం చేసేశారటకదా ?

దే : అవును తాతగారూ !

అం : ఎంతపని చేశారు బాబూ !

దే : చెయ్యదగ్గపనే చేశాను తాతగారూ !

అం : కాదుబాబూ ! .... ఇది కానిపని.... మీరు.... మీరు మాట మార్చుకోవాలి.

దే : అంశుమంతులవారే యిలాగంటూరా !? తాతగారూ ! పరమ పవిత్రురాలైన కన్నతల్లిగర్భానికి కళంకం తెమ్మంటూరా? హరి బ్రహ్మాదు లడ్డమైనా ఆడినమాట తప్పదన్న కీర్తి గన్న కురుప్రభువంశం గోడు పాడుచెయ్య మంటూరా ? జగజ్జేజీయమానులై యావద్భారతాన్ని పరి పాలించిన మహామహులు పితామహుల మానమర్యాదలు మంటగలుపమంటూరా ? సత్యవ్రతాచార్యులైన శంతన రాజేంద్రుల కుమారుడు కొంఅమాలినవాడు కమ్మంటరా ? చెప్పండి స్వామీ !

అం : బాబూ! రాజకీయాలకూ వైదిక వ్రతాలకూ ముడి పెట్టవద్దయ్యా?

దే : భారతదేశ నేతలమైన మనమే వేదధర్మాలకు విడాకు లిస్తే ధర్మదేవతకు దారితెన్ను లున్నాయా స్వామీ!?

అం : అబ్బబ్బా! .... మీరు మహాధర్మవేత్తలు. నే నెలా మీలో ధర్మలోపం చూపగలను? మిమ్ముల నెలా త్రోవలో పెట్టగలను బాబూ! .... చినబాబూ! పెద్దవాడను. మీ శ్రేయస్సును కోరినవాడను....నా మాట వినండి బాబూ!

దే : ఉహుఁహు....తాతగారూ! మీరు నాకు పితృతుల్యులు. మీ మాట నెన్నడూ మీరిపోలేదు...కాని...ఇది తిరుగరాని తరుణంగదా స్వామీ!

అం : ఊఁ....(నిట్టూర్చి)....నిజమే బాబూ! దాటిపోయింది. తరుణం దాటిపోయింది... నేనూ మీ వెనుకనే వచ్చాను బాబూ! కాని మార్గమధ్యంలో మారాం పెట్టింది అశ్వం. అక్కడే ఆలస్య మైపోయింది. మహారాజావారూ మన గౌరాంగుడూ మరికొంత వెనుకగా వస్తున్నారు. వారు వచ్చే లోపున నేనే సమస్య సమర్థిస్తా ననుకొన్నాను. అతివేగంగా వచ్చాను. ఏం లాభం? తరుణంలో దగ్గర లేకపోయాను. కానిఘడియలు కసి తీర్చికొన్నాయి .... ఊఁ .... సరేలే బాబూ! ఇక మిమ్ముల నిబ్బంది పెట్టను....ఇప్పుడు నే నేం చెయ్యాలో ఏమీ పాలోవ్వదు బాబూ!

దే : ఉహుఁహుఁ...ఇక మీ రాలోచించేదేఁవిటి తాతగారూ!?

అం : అలాగా బాబూ !? ఎంత సులువుగా అన్నారు ?

తాతముత్తాతల తరములనుండి మి
　　మ్ములను ప్రెగ్గడలమై కొలిచినాము
అనితరసాధ్య రాజ్యాంగసమస్యలన్
　　లెక్కసేయక సమర్థించినాము
మా సార్వభౌముల మహితవంశమ్మును
　　కంటిరెప్పలమయి కాచినాము
రాజ్యమ్ములో గల ప్రజల కెల్లరికిని
　　యెల్లసుఖాలు కల్పించినాము
మాట దక్కించికొన్నాము నేటివరకు ;
నేడు తలయెత్తిన దలంఘ్యనీయ విషమ
ఘట్ట మొక్కటి కురుకులాగ్రణుల యింట ;
మంత్రికే తలవంపిది మలుపకున్న ॥

దే : పాపం !

అం : పాపమే బాబూ ! భగవంతుడే దీనిని పరిష్కరించాలి.... బాబూ ! గౌరాంగ, సార్వభౌములు వచ్చేవరకూ నే నిక్కడుంటాను. మీరు గుడారానికి వెళ్లండి.

దే : మంచిది...ఆ అమాయికుల కన్యాయం జరుగరాదుసుమండీ తాతగారూ !

అం : అలాగేబాబూ !

(దేవవ్రతుడు నిష్క్రమించును)

అమ్మా ! యెంతనిరంకుశవ్రతులు నీ
హారాంశువంశప్రభుల్ !
కొమ్మల్ మెచ్చిన వీరులయ్యును విరా
గుల్ ; కీర్తియే కోరి కా
ర్యమ్ముల్ జేతురు ; ప్రాణమానధనముల్
రాజ్యములున్ పూరి సా
మ్యమ్ముల్ బోలును వీరి ; కీ నృపుల కీ
మర్యాద లెట్లబ్బెనో !॥

ఓ యోధాగ్రణి ; యెంతసాహసము ? నీ
యోర్పెంత ! నీ త్యాగమున్
న్యాయమ్మున్ సరిహద్దు లేనివికద
య్యా ! గవ్వకుం గాని దై
వాయె న్నీ కొక సార్వభౌమపదమే
హా ! నీవు మర్త్యుండవే
నా ! యేదేవత విట్లు పుట్టితో ప్రతి
జ్ఞాప్రౌఢి జూపింపగన్ !॥

కన డొకింతయేని కార్పణ్యముం దాళ
దొర యొనర్చియున్న దుష్కృతికి ;
సవతితల్లి యనక సత్యవతిం గన్న
తల్లిగా దలంచె ; తన్ను మరచె ॥

ఈ ధర్మచ్యుతి నెలా తప్పించాలి ? నీకు కానున్న మహావిపత్తు
నెలా గడపాలి బాబూ !? సత్యవతెమ్మ సతి గాకపోతే
సార్వభౌముల ప్రాణాలకే ప్రమాదమా ? తర్జనభర్జనచేసి

దాశరాజును దారికి తెద్దామంటే యువరాజావారందు కుగ్రులైపోతారా? పోనిమ్మని ఊరకుంటే శరచ్చంద్రుని వంటి కౌరవవంశం సంకరమైపోవటమే కాక పట్టాభిషిక్తులై యున్న బాలరాజు గుండెలకు బల్లెపుపోటూ, భారతరాజ్య ప్రతిభకు తీరని భంగపాటూ? ఈ తీరని రాజ్యాంగ మేఘాంధకార మెలా తెలతీస్తావు సర్వేశ్వరా!? పేరెన్నిక గన్న ప్రెగ్గడల రాజకీయసామర్థ్యానికే పాలుపోని పరీక్ష కల్పించావే మహానుభావా!....అంశుమంతుని మంత్రాంగ మహిమ మాసిపోయినట్లేనా? నాల్లు తెగి గోళ్లు గిల్లికొంటూ కూర్చోవలసినదేనా యీ ప్రధాని?....కాదు....కాదు.... మహామంత్రీ! నీకింకా మార్గమున్నది. దాశరాజుపైన తామస మక్కఱలేదు. బాలరాజు బాధపడ పనిలేదు. సార్వభౌములు సత్యవతిని చక్కగా వివాహం గావచ్చు. అరాజకం ఆగే మార్గం అదే....అంతే....అదే....అదే.... అరుగో! గౌరాంగ సార్వభౌములు.

[శంతనమహారాజు, గౌరాంగుడు ప్రవేశింతురు]

శం: ఏమయింది మంత్రిగారూ!?

అం: కాగూడనిదే అయింది ప్రభూ!

శం: ఇంతలోనేనా?

అం: అవును ప్రభూ! నేను వచ్చేలోపుననే సమయం నిండి కొన్నది. యువరాజావారు రాజ్యం విడిచికొన్నారు.

సాత్యవతేయులే సార్వభౌమపదవి నలంకరిస్తా రన్నారు. బ్రహ్మాండమైన ప్రతిజ్ఞ చేసేశారు ప్రభూ!

శం: ఎంతపని చేశాడు!

గా: చేస్తాడు మహారాజా! ఆయన చేసిన ప్రతిజ్ఞ స్థిరంగా నిల్పుకొంటాడుకూడా.

తాచుపాము విషము తల కెక్కి దిగవచ్చు;
వేటగత్తి వ్రేటు దాటవచ్చు;
పిడుగుపాటునేని పెడమార్చవచ్చును;
బాలరాజుచేత బ్రహ్మవ్రాత ॥

అం: అది సత్యమే గౌరాంగా!

శం: కాదు ప్రధానిగారూ! అది సత్యంగాదు. అబ్బాయి ప్రతిజ్ఞ కర్థంలేదు.

అం: అంటే? .... మీ అభిప్రాయం?

శం: అదేనండీ!

తాను రాజైన రాజ్యము తనది యగును;
ఇపుడు యువరాజు మాత్రమే; యెట్లు పుడమి
తనది కాగల్గు? కానిచో దాని నెట్లు
పరులకుం దాన మిచ్చుట భావ్యమయ్య!? ॥

అం: ఇది.... యుక్తియుక్తంగానే ఉన్నది...కాని...కాని...

గా: ఇంకా కాని కాని అని గంటనాలుక కట్టిపెడతా రెందుకు స్వామీ!? దేవవ్రతు డంత తెలివిలేనివాడు కాదండీ.

రాజ్యరమ కిప్పు డతడె వారసుడు ; యౌవ
రాజ్య పట్టాభిషేకమే వ్రాసె నటుల ;
ఆతడిచ్చిన దిపుడు రాజ్యమ్ము కాదు ;
హక్కుగద దానమిడె? నెవ్వ డడ్డు దాని ? ॥

అం : అదే నే ననబోయేది గౌరాంగా !

గౌ : అనేమాట బాహాటంగా కుండబ్రద్దలుకొట్టి అనండి స్వామీ ! అర్ధోక్తుల్లో ఆపితే అధికారుల బుఱ్ఱల కర్థంగాదు గదా ! రాజావారి వాదం యీ సమయంలో పనికిరానిది. మరేదైనా మార్గ మాలోచించండి.

శం : ఊఁ.... (నిట్టూర్చి) ఆలోచించండి మహామంత్రిగారూ !

గంగాదేవత యానవాలు ; నతడో
క్కండయ్యె పుత్రుండు ; స
త్సంగుం ; డాత్మవివేకి ; మామక మన
స్సంతోషసంధాత ; మా
బంగారమ్మను ; ప్రాణపంచకము ; మా
బాలుండు ; మా తండ్రి ; మా
గాంగేయుం డవయోగదగ్గుడగుటం
గానంత సైరింతుమే ? ॥

బాగా ఆలోచించండి స్వామీ !

ఇంత వయస్సు వచ్చినప
యిన్ మము గామపిశాచి పట్టుశే
చింతయు సిగ్గుచే టనిన,
జ్యేష్ఠకుమారుడు మాదు పెండ్లి కిం

తింతలు జేసి రాజ్యము త్య
జించి యొకానొక భ్రష్టుడైన వి
శ్రాంతియె మా మనమ్మునకు ?
శాశ్వతదుర్యశమున్ సహింతుమే ? ॥

ప్రధానిగారూ ! వార్ధక్యం వచ్చిన మా కీ వల పిం కే అనర్థకా లాపాదించనున్నదో. ఎన్ని దౌష్ట్యాలకు దారితీయగలదో. ఈ వివాహేచ్ఛ విడిచికోనైనా విడిచికొంటాం. ఈ శరీరం చాలింపనైనా చాలిస్తాం. దేవవ్రతుని దీనునిగా మాత్రం చూడలేము. తగిన యోచన చెయ్యండి స్వామీ !

అం : ఒకే మార్గమున్నది ప్రభూ !

శం : ఏఁవిటది ?

అం : దాశరాజు తనంతట తాను దారి తప్పికొనేట్టు చెయ్యాలి ప్రభూ !

గౌ : మార్గ మున్నదా అందుకు ?

అం : ఉన్నది.

గౌ : అయితే యిక ఆలస్యం యెందుకు ? మీతో నేనూ వస్తాను. నడవండి.

అం : పోదాం గౌరాంగా !.... సెలవు ప్రభూ !

శం : మంచిది. ధర్మలోపంమాత్రం తగదుసుమండి మహా మంత్రిగారూ !

అం : అలాగే ప్రభూ !....రా గౌరాంగా !

(అంశుమంత గౌరాంగులు నిష్క్రమింతురు )

శం: ఛీ ఛీ! కౌరవవంశ గౌరవమంతా మాతోనే గంగపాలు కాబోతున్నది కాబోలు. శాంతి సౌఖ్య సంపూర్ణమై చల్లగా నున్న భరతవర్షానికి మేమే షష్టాష్టకం గాబోలు...అవును... అంతే.

కామమే కారణ మనర్థకములకన్న
మరణ మాసన్నమైయున్న మాకు నిపుడు
జవ్వనులపైన వల పరిష్టాగ్రహమ్మ
కాదె? జగ మెల్ల భగభగ కాలిపోదె?॥

ఏటికి వేటకుం జనితి?
మెందులకుం జరియించినాము ఘో
రాటవులందునన్? యమున
యందున గన్పడె నేల మాకు నా
బోటి? సుమాస్త్రు డెందుకని
పూవుటలుంగుల గొట్టె మమ్మ? న
ప్పాటున నింత దుర్గతికి
బాల్పడు టెందుకు మేము శ్రీహరీ!?॥

[సత్యవతి ప్రవేశించును]

వచ్చావా సత్యా!? వచ్చావా?...రా సత్యా!....రా...రా... చూచావా సత్యా!? ఆకసం నీలమేఘావృతమై జగత్తంధ కారబంధుర మైపోయింది చూచావా? మన వివాహానికి మహేశ్వరు డింత వ్యతిరేకించాడేం సత్యా!?

స : మాటతప్పిన బాంధవ్యాలకు బాధలు పరిపాటే ప్రభూ !

శం : ఇప్పు డేమి చేదాం సత్యా ! ?

స : నా మాట పాటిస్తారా ప్రభూ ! ?

శం : నీ వేమన్నా మాకు వేదాక్షరమే....చెప్పు సత్యా ! ప్రాణత్యాగమైనా చేస్తాము.

స : అంతమాట వద్దు ప్రభూ ! ప్రభువులు బాగుండాలి. మాంగల్యం గట్టికపోయినా మనోహరులైన శంతనప్రభులే సత్యవతి హృదయేశ్వరులు. వారు బాగుంటేనే సత్యవతి సువాసిని. ఏ యోగ మెలాగున్నా మీరు బాగుండాలి ప్రభూ !

యోగ మది యేమొ కలిగె సమాగమమ్మె
మనకు ; మనసులు గలిసె ; నా మనసు తనిసె ;
మీరలే ప్రాణపతి నాకు ; మీరె వ్రతము
గా తలంచుచు కాలము గడిపికొందు ॥

కాని.... కాని... కాని....

శం : కాని ?....ఏఁవిటది సత్యా ! ? ఏమంటావు ?

స : మీరుమాత్రం సత్యను మరచిపొమ్మని మరీ మరీ ప్రార్థించి కొంటాను ప్రభూ !

శం : సత్యా ! ?

స : అవును ప్రభూ ! మన కల్యాణం భగవదిచ్ఛకాదు. న న్నాశించి యువప్రభువుల కన్యాయం చెయ్యవద్దు. గాంగేయులకు

దుర్గతి కలిగించి గంగాదేవి శాపానికి గురి కావద్దు. ధీరో దాత్తుడైన దేవవ్రతకుమారుని కపరాధం చేయవలసి వస్తే స్వర్గరాజ్యసింహాసనలాభమైనా తమరు త్యజింపదగ్గదే.... భీష్మ ప్రతిజ్ఞ చేశారు పిన్నరాజావారు. నే నెంత బ్రతిమాలినా పట్టు విడువలేదు. వారి అధఃపతనాని కాదిమూలం నేను. నన్ను మీరు మరచిపోతేగాని జగత్ప్రళయాగ్ని చల్లారదు. కౌరవరాజ్యగౌరవం నిలువదు ... నన్ను మరచిపొండి ప్రభూ !....నమస్కారం.

( నమస్కరించుచూ ఏడ్చుచూ నిష్క్రమించును )

శం : సత్యా !...సత్యా !.... బాబూ! దేవవ్రతా !...గాంగేయా ! కన్నుల వెన్నెలా !

( దీనముగా అఱచుచూ నిష్క్రమించును )

( తెర పడును )

# పంచమాంకము

## 1-వ రంగము

## కోటప్రక్క ఉద్యానవనము

[ కల్యాణుడు, గౌరాంగుడు ప్రవేశింతురు ]

క : రాజ్యమే త్యాగం జేసేశారా స్వామీ!?

గౌ : ఆఁ....చేశాడు. బ్రహ్మదేవుడే వచ్చి పట్టా పట్టుకొని వాదించినా మళ్ళా పరిగ్రహించడట రాజ్యం.

క : వారు పట్టినపట్టు విడరు స్వామీ!?

గౌ : అవునయ్యా! కండబలం గలవాళ్లకు మొండిపట్టుదల కూడా మెండే.

ఎలుగుబంటి పంది యేనుగు యోధుండు
నొక్క తెగకు చెందియుందురేమొ!
అగ్నియందు శిరసు లాహుతి యగుచున్న
వేళనేని పట్టు విడువరయ్యా!॥

కోలలు వచ్చి గుండెల్లో గ్రుద్దికొంటున్నా, తాను పట్టికొన్న గోవును విడువనన్నది క్రోల్పులి. కొండ యెక్కిన

మనుష్యులమీది కోపం తీరక కొమ్ములతో కొండనే క్రుమ్మి తన తల పిండిచేసికొన్న దడవిదున్న. రాజ్యం రాళ్లపాలై పోతున్నా ప్రతిజ్ఞ కాపాడికొంటానంటాడు దేవవ్రతుడు. కత్తితో జీవించేవాడికి ప్రపంచం కల్ల కల్యాణా! అతడు పట్టిన పట్టు విడిచేట్టు లేట్ట.

క: అయితే....గత్యంతరం లేదంటారా స్వామీ!?

గా: అతనికి గత్యంతరం లేని ఒత్తిడి కలిపిస్తే త్రోవకు రావచ్చు.

క: అందు కే మాలోచించారు స్వామీ!?

గా: అంశుమంతులవా రేదో ఆలోచిస్తున్నారు. దానితో దాశరాజు తాను కోరినవరం తానే కూడదీసికొంటాడట.

క: ఓహో!.... అలాగైతే తండ్రిగారి తదుపరి దేవవ్రతుతే ప్రభువు గాక తప్పదు. వారి మన సప్పటికి మారవచ్చు. ఈ ఉపాయం బాగున్నది స్వామీ!

గా: బాగానే ఉన్నది...కాని...కాని...ఈ మట్టికట్ట మహా ప్రవాహా న్నరికట్టలేకపోవచ్చు. ఒకటికి రెండు జతకూడితే, మరో మార్గంకూడా చూస్తే – మంచి దనుకొంటాను.

క: ఇంకొక మార్గ మున్నదా స్వామీ!?

గా: ఉన్నదున్నది. కల్యాణుడు సి గెగగట్టాలి దానికి.

క: నేనా?

గా: అవును....నీవేనయ్యా! కలుగులన్నీ కప్పితేగాని యెలక బైటపడదు. నీ ప్రయత్నం నీవూ చెయ్యాలి.

క: నా ప్రయత్నం యేఁవిటి స్వామీ!?

గా : నీ ప్రయత్నమే ప్రబలప్రయత్న మని నే నాశపడు తున్నాను కల్యాణా! అందుకే అంశుమంతులవారిని దాశరాజుదగ్గరకు చేర్చి నేను నీవద్దకు వచ్చాను పడుతూ లేస్తూ.

క : నే నేం జెయ్యాలి స్వామీ!?

గా : ఏమి చేసినా నీవే చెయ్యాలయ్యా యిప్పుడు.

ఆప్తమిత్రుడు కల్యాణు ; డతనిమాట
వేదమే రాజసుతునకు ; నేది యన్న
కా దనడుగద ? యా మదగజము కుదుట
బడుట యిప్పుడు నీ కెంతపని కుమార !? ॥

ఇదివరకే నీ కతడు వరా లిస్తా నన్నాడు. అవసరమైనప్పు డడుగుతా నన్నావు నీవు. అది యిప్పుడు మనకు మంచి అవకాశం. యువరాజు రాజ్యం స్వీకరించటం ఒకకోరిక కావాలి నీ కిప్పుడు...ఏం? .... కాదంటాడా?

క : కాదనరు....కాని...కాని....

గా : ఏఁవి టా కాని?

క : నా కోరిక వేరు స్వామీ!

గా : ఏఁవిటది?

క : అది... మీకు చెప్పేదికాదు.

గా : సరి సరి .... దిశలన్నీ తెల్లవారిపోతున్నా జ్యేష్ఠాదేవికి నిద్ర తేలదట. రాజనందనుడు రాజ్యభ్రష్టుడై పోతున్నా నీ కోరికకు రహస్యమేనా? కాచి కాచి చూచి నక్కకా లను కొని కడిమివేరు పట్టుకొంటావే మోసుమా మకరీ!

క : పోనివ్వండి స్వామీ! నాకు కావలిసింది వారి రాజ్య భోజ్యాలు కాదు.

గా : మరి? నీవు కోరినది వారి భ్రష్టాకారమా?

క : భ్రష్టులైనా యేమైనా నాకు కావలసింది వారే.

గా : ఓరిబాబు! సహాధ్యాయులైనందుకు పిచ్చికూడా సమానంగా ఉన్నది మీ కిద్దరికీ.

అతని కొక పిచ్చి; పిచ్చి నీ కంతకంటె;
ధార విడిచెను తన ప్రభుత్వమున కతడు;
భ్రష్టుడగు నాతడే నీకు వాంఛ; యకట!
త్యాగ మన్నది యొక పిచ్చితనమొ, యేమొ!॥

ఏఁవిటిది కల్యాణా!? రాజ్యభ్రష్టుడైన దేవవ్రతుడే కావాలని నీ వాంఛకాదుగా?

క : కాదు స్వామీ! కాదు.

గా : కాదుకాబట్టి అతడు రాజ్యభ్రష్టుడు కాకుండా చూడక గూడదటయ్యా? చిక్కంతా నీవే చేదగల విప్పుడు. నీ మాటతో మహారాజుల మనస్తాపం చల్లారగలదు. సత్యవతమ్మ వివాహం కొనసాగగలదు. అపాత్రుడు హస్తిపురసింహాసనం అపవిత్రం చెయ్యడు. దేవవ్రతుడు రాజౌతాడు. అరాజకం ఆగిపోతుంది. ఇంత మేలు చెయ్యడాని కెందుకు సందేహిస్తావు కల్యాణా!?

క : సందేహించను స్వామీ!....మీరు బయలుదేరండి.... నేనూ వస్తున్నాను.

గౌ : త్వరగా రా మరి....అశ్వశకటం అదిగో! నే నక్క డుంటాను....కల్యాణా! ఇప్పటికే ప్రొద్దు మించింది. ఇంకా ఆలసిస్తే ఆశాభంగమేసుమా.

క : అలాగే.

(గౌరాంగుడు నిష్క్రమించును)

ఆఁ !?...కుడికన్ను....అదురుతున్నదే! అయ్యో! కుడిభుజం కూడా కొట్టికొన్నది. ఈ అపశకునా లేవిటి ప్రభూ!?

హృదయమా! నీకు తొందరయేల? శాంతి
గొనుమ; భయ మందబోకుమా; కనుల నీరు
పెట్టకుమ; నీదు జీవనవిధి విధించి
యుండు నింతకుమున్నె యీశుండు నుదుట॥

(నిష్క్రమించును)

(తెర పడును)

## 2-వ రంగము

## యమునగట్టున గుడారము

[ శంతనమహారాజు, దేవవ్రతుడు మాటలాడుచుండ

శం : నిజమే దేవవ్రతా! కనిష్ఠసోదరులుంటే కావనుకొన్నాను. ప్రజలను పరిపాలించటంలో స

నీకు సహాయపడతా రనుకొన్నాను. కౌరవవంశ మభివృద్ధి కాగల దనుకొన్నాను. అందుకు ద్వితీయవివాహ మాశించాను. దాశరాజుకామితం దారితప్పుతుం దనుకోలేదు. నీ గుండెలమీదికి కుంపటి కోరలేదు. నా కన్నబిడ్డ కంటిలో నలుసు నా గుండెల్లో కులిశధార. నా గాంగేయునికి బాధాకరమైతే స్వర్గరాజ్యపట్టాభిషేకం నాకు నరకకూపపతనం.... బాబూ! పదికాలాలపాటు బ్రతికి ప్రాపంచిక సుఖా లనుభవించి పరలోకయాత్రకు పయనం గట్టికొన్న ముక్కాలి ముదుసలి తండ్రిని నేను. ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డవు నీవు. నాకోసం నీవు త్యాగం జేస్తావా? నా శృంగారంకోసం నీ బంగారుజీవితం బలిచేస్తావా? నా ఆనందంకోసం నీవు హాలాహలం ఆపోశన పడతావా? నా పెండ్లికోసం పెన్నిధులనూ, పెన్నిధులకంటే ప్రియమైన ప్రజలనూ, ప్రజలశ్రేయస్సుతే ప్రథమలక్ష్యముగా గల రాజ్యపరిపాలననూ పరిత్యజిస్తావా? సమస్తకల్యాణగుణాభిరాముడవైన నీ వుండగా సాత్యవతేయులను సార్వభౌములను చెయ్యమంటావా? వంశపారంపర్యా వస్తున్న ప్రబలవారసత్వాధికారాన్ని ప్రతిజ్ఞామాత్రంచేత పాడు చేస్తావా?...ఈ విపరీతకర్మ యెవరికి సంతోషకరం తండ్రీ!? నీకు సవతితల్లి కాదలంచిన సత్యవతి యిందు కెంతమాత్రం సమ్మతించలేదే. అంత్యఫలితా లాలోచించక అమాయిక వర మడిగిన దాశరాజుకూడా యీ అక్రమానికి యథాయథ లౌతున్నాడే. మహామంత్రిగారు క్రుగ్గిపోతున్నారే. కల్యాణుడు కమలిన కమల మైనాడే. ప్రజల్లో విషాద

విప్లవ హాహాకారాలు విజృంభిస్తున్నవే.... నిన్ను గన్న గంగాదేవి కీ వార్త యెంత సంతాపకరమో ఊహించి కొన్నావా నాన్నా!? ఇందరి నేడిపించి నీ వింత త్యాగం చెయ్యవద్దుసుమా. కౌరవరాజ్యసింహాసనం కానివారికి కట్టి పెట్టవద్దుసుమా. హస్తినాపురప్రభుత్వాని కపహాస స్థితులు తేవద్దుసుమా. తెలియక ప్రతిజ్ఞలు చేసి తీరని నష్టం తెచ్చికోవద్దుసుమా. శంతనసార్వభౌముని కంత్య దశలో దిగంతవిశ్రాంతదుర్యశస్సు సంప్రాప్తింపనీవద్దు సుమా.... బాగా ఆలోచించు నాయనా! నీవు లేక లేక కలిగిన బిడ్డవయ్యా! అష్టవసువుల అంశాలతో అవతరించా వయ్యా! కౌరవకులాలంకారుడవు కాదగ్గవాడవయ్యా! తాత ముత్తాతలను తరింపజేయగల హుందాతనం ఉన్న వాడవయ్యా! నిన్ను జూచికొని నీ తల్లివిరహం మరచి పోతున్నాను. నీ పురోభివృద్ధి కోరి పుట్టెడు శ్రమ పెట్టి కొన్నాను. నీవు వంశంకరుడవు కాగలవని కలలు గంటు న్నాను. నీయం దెన్నో ఆశ లుంచికొన్నాను. నన్ను హతాశుని జేయకు. నా కవమానాలు రానీకు. బాల్య చాపల్యంతో చేసిన ప్రతిజ్ఞ నిల్పికోవటానికి పాటుపడకు. మాట మరలించికో నాయనా! పట్టు విడువు తండ్రీ! నా మనస్తాపం చల్లార్చు దేవవ్రతా! నీ పితృవాక్యపరిపాలన దీనిలో కనుపింపనీ తండ్రీ!

( దేవవ్రతుని చేతులు పట్టుకొనును )

దే: ఉఁహుఁహుఁ.... అపశ్రమలతో ఉపన్యసిస్తున్నారు నాన్న గారూ!

కౌరవాన్వయ మహాదలంకార వీర
ధారుణీపతు లెందరు తరలినార
లిప్పటికి? వారి మరచునే యీ జగమ్ము?
కారణము వారి కీర్తియేగాదె? తండ్రి!॥

అనృతము లాడ రీ కురుకు
 లాన్వయు లన్న జగమ్ము నేడు శం
తన సుతు డాడి తప్పెనని
 తమ్ము ననుం గుఱిజేసి వ్రేలు చూ
పిన తలదీసినట్లుగద?
 పెద్దలు నాదుప్రతిజ్ఞ మార్ప జూ
చిన గతి యేది కల్గునిక
 చిన్నకు నాకు? మతిం దలంపరే॥

తండ్రికోర్కి తీర్పదగనిదా సుతునకు?
సుతుని వ్రతము మాన్ప పితకు నగున?
శిరులు కరులు ధరలె పరమార్థమా! శాశ్వ
తమ్మ నరుల జీవితమ్ము నాన్న!?॥

అమ్మకు దూరమౌ సుతున
 కమ్మ లభించుచునున్న యెంత శ్రే
యమ్మగు? నాకు తమ్ము లుద
 యమ్మగు చెంత ముదమ్ము? రాజకీ
యమ్ములు మాని మాధవ ప
 దాంబుజనిర్మలనిత్యభక్తి భా
గ్యమ్మను పొందు చెంతపర
 మార్థము? యోగవిదగ్రరత్నమా!?॥

మీ చిన్నకోరిక సిద్ధించనివ్వండి నాన్నగారూ! దేవవ్రతుడు పితృవాక్యపరిపాలకు డన్న మంచిపేరు దక్కించండి.

శం: నీవు పితృవాక్యపరిపాలకుడ వైతే నేను పుత్రఘాతకు డను కానటయ్యా!?

దే: అది ఘాతకాదు నాన్నగారూ! ఘనత. మీరు కన్నబిడ్డకు చెడ్డ కాంతించలేదు.

శం: కలిగిన ఫలితంమాత్రం చెడ్డకదా?

దే: ఎవరి కర్మ కెవరు పాత్రులు నాన్నగారూ!? పురుషుడు చేయవలసింది పుణ్యం. కొందరి కది పాపమైతే ఆ నింద పురుషునిదా?

[అంశుమంతుడు ప్రవేశించును]

అం: ఎవ్వరూ పాపం చెయ్యలేదు. ఎవ్వరికీ నిందరాదు. సమస్య పరిష్కారమైపోయింది యువరాజా!

దే: ఏమి టది తాతగారూ!?

అం: ఇంకేమున్నది బాబూ!

ధర్మమార్గవర్తి దాశరా; జేలనో
దారితప్పి వరము కోరెనేమొ;
తలయు తోక లేని కల యది యని నేడు
తెలిసికొనియె; తప్పు దిద్దికొనియె॥

దే: ఏమి జరిగింది తాతగారూ!?

అం: అతడు తన కోరిక మార్చికొన్నాడు బాబూ!

దే: కారణం?

అం: అది అక్రమమేగాక అనాచరణీయం అన్న కాసంత సత్యం గ్రహించికొన్నాడు బాబూ!

శం: గ్రహించికొన్నాడుగదా స్వామి!?

అం: అంతేకాదు ప్రభూ! షరతు లేమీ లేకుండా సంతోషంగా సత్యవతీదేవి నిచ్చి మీకు వివాహం జరిపిస్తా నన్నాడు.

శం: మళ్లా మారిపోడుగదా?

అం: మరో జన్మలోకూడా మారడు ప్రభూ!

శం: అమ్మయ్యా! .... కారణంలేని కల్లోలమై భూచక్రం కదలిపోయింది ... ఎంత తొందరపడ్డావో చూచావా దేవవ్రతా!?

దే: ఇదంతా సత్యమా ప్రధానిగారూ!?

ం: ఆ దాశరాజునే అడగండి బాబూ!

: అలాగే....అతన్నే అడుగుతాను....ధర్మం నడచిన దారి చూస్తాను.

(విసవిస నడచి నిష్క్రమించును)

అం: జాగ్రత బాబూ! .... ఆత్రం వద్దు యువరాజా!

శం: ఉద్రేకి ... ఉపద్రవం మరేమో?

అం: భయంలేదు ప్రభూ! దాశరాజిక దారితప్పడు. వివరాలు విన్నవిస్తాను. దయచెయ్యండి.

శం: మనవి చెయ్యండి. మనవి చెయ్యండి.

(ఇరువురు నిష్క్రమింతురు)

(తెర పడును)

## ౩-వ రంగము

## దాశరాజు గృహముప్రక్క పూదోట

[సత్యవతి పున్నాగవృక్షము నెదుట నిలచియుండును. ప్రక్కనున్న మాలతీలతను చేతబట్టికొని యుండును.]

స : పూచి కాచిన పున్నాగభూవరుండు
జత కుదిరె నీకు నీయదృష్టమ్మొకొలది ;
మాలతీకన్య! పల్లవ మధురవల్లికా
కరమ్ముల నతనిని కౌగిలిమ్మ ॥
(మాలతీలతను పున్నాగవృక్షమునకు మెలికలు వేయును)

మీ రాదర్శదంపతులై ఆనందమయజీవనం చెయ్యండి. అమరులై అకలంకప్రేమామృత మారగించండి. స్వేచ్ఛా విశ్వసంచారులై చివరియెల్లలు చూడండి. సత్సంతానవంతులై జగత్కల్యాణానికి సాయపడండి ... మిమ్మలను భగవంతు డాశీర్వదిస్తాడు....ఓ మాలతీ! నీ వెంత అదృష్టవతి వమ్మా! కోరిన వరుని కౌగిలి చేరికొన్నావు. కుసుమకుట్మల మందహాసచంద్రికలతో శోభిస్తున్నావు. ఆనందం నీదే. హాయి నీదే. అమరసౌఖ్యం నీదే.... నీదే...నీదే....నాది కాదు. నేను నిర్భాగ్యను. దురదృష్టవంతురాలిని. నీవలె ప్రేమించిన వానిని పెండ్లాడే భాగ్యం నాకు లేదు. నీ తల్లి నీకు తరురాజం పైకి దారి చూపింది. నా తండ్రి నా మనోధవుని దారి కడ్డైనాడు. నీ తల్లికి నీపై యెంత ప్రేమో, నా తండ్రికి నాపైనా అంతే ప్రేమ. కాని నీ తల్లి ప్రేమ నీ కమృతమయింది.

నా తండ్రి ప్రేమ నాకు విషమయింది....అది నాకు విషమై నన్ను నాశనం జేసినా బాగుండును. సార్వభౌముల కసామాన్యదైన్యస్థితి తెచ్చింది. యువసార్వభౌములకు దుర్యోగమయింది ... నే నేమనను? నా శ్రేయస్సు కోరిన తండ్రి తలంపు చేటననా? నా పొందుగోరిన భూమీశ్వరునిది పొరపాటననా? పితృవాక్యపరిపాలనకై భీష్మప్రతిజ్ఞ చేసిన దేవవ్రతుల తెలివితక్కువ అననా?...ఎవరి నేమంటే యేమి లాభం?.... లేదు.... లేదు...లేశమంతకూడా లాభం లేదు. నేను విచారించి ఫలమూ లేదు.... నేను శాశ్వతబ్రహ్మచారిణి నైనా కావాలి. మరణమైనా నాకు శరణ్యం గావాలి .... అంతే.... అంతే....మరణమే నాకు శరణ్యం

సత్యవతి! వ్యర్థ మిక నీదు జన్మ; నీ శ
రీర మిప్పుడు భూమికే భారమయ్యె;
నీవు పుట్టినయమునకే నీదు మేను
నప్పగింపుమ; మీల కాహార మగుమ ॥

( నడికట్టుపోసికొనును )

దుర్విధీ! నీ వికేని సంతోషపడుమ;
అంతరించుచునుండె సత్యవతి జన్మ:
మహిత కౌరవవంశసమ్రాట్కిశోర
కంఠమున్ వీడి యెటకేని కదలిపోమ్మ ॥

( తెరలో )

లప్పా! లప్పా! లప్పా!

ఊఁ .... ( నిట్టూర్చి ) తమ్ముడు...రంగరాజు. పసిబిడ్డకంటె అమాయికుడు. పాపపుణ్యా లెరుగడు. న్యాయం దంతులేని

ఆప్యాయత. ఘడియ నన్ను విడచి నిలువలేడు. నే నేడిస్తే యేడుస్తాడు. నేను నవ్వితే నవ్వుతాడు. నేనే తాను, తానే నే నై పోయాడు. ఈ బాలుడు నా కొక ప్రతిబంధం....భగవంతుడా! ప్రపంచంలో ప్రాణుల కెన్ని బంధనాలు కల్పన జేశావు స్వామీ!

[రభసముగా రంగరాజు ప్రవేశించును]

రం: లప్పా! లప్పా!

స: ఏం రంగా!

ర: సంపేత్తానే

స: ఎవరిని?

రం: యోఁవికి లికగబొడిసేత్తానే. గుండికాయి కోసేత్తానే. కళ్లు పీకేత్తానే.
(సత్యమీదికే ఆ భావములు నటించును. సత్య ఉలికిపడుచుండును)

సంపేత్తానే.

స: ఎవరనిరా?

రం: ఆణ్ణేనే, యి కాడు బూపెపంచికంమీద పుట్టగూడదే. ఆడి పేణాలు బూదేయికి బలువే. నా యప్ప కిన్ని తిప్పలు దెచ్చిన దెయ్యాన్ని సూత్తే నా కళ్లు కఅక ఱ్ఱాడిపోతున్నయ్యే. నా సత్తెక్క పెళ్లి కింత సంకటం వైపోన కొంకనక్క పేరే త్తితే నాగుండిలు గుబగుబ మని కొట్టుకుంటున్నయ్యే. తెగమొడిసేత్తానే.

స: ఎవరెనిరా రంగా!?

రం: మన బాబునేనే.

స: రంగా!?

(ఆత్రముగా అఱచును)

రం: అవునే సత్తెక్కా! బాబుతొత్తుకొడుకునేనే. ఆ దుట్టుప్పురు గెంవలోకాని కెల్లిపోవాలే. ముసలితొత్తుకొడుకే. మోటదున్నపోతే. నీ పెళ్లి పెడాకులుజేశాడే. ఆడు సత్తేగాని బూవి సల్లబడదే. ఆడి గొంతుకు పీకికోసేత్తేగాని నా పేణం కుదుటకోదే....నువ్వు కూకునుండే లప్పా!....నే నెల్లి....నే నెల్లి....

(కత్తి దూసి సంరంభముగా ముందుకు నడచును)

స: రంగా! రంగా! ఆగరా.

(రంగరాజును పట్టికొనును)

రం: ఇంక న న్నాపకే. ఆ డంతు సూత్తేగాని నీ మొకం సూణ్ణే. నే నిప్పుడు బెమ్మరాచ్చసినే. జాతర్నాటి శాంబవమ్మోర్నే. జాలి సెవ ల్లేని కసాయోణ్ణే....న న్నొదిలెయ్యే లప్పా! నన్నుపోనియ్యే లప్పా! న న్నాపకే లప్పా!

(విడిపించుకొనుటకు గుంజులాడును)

స: రంగా!

(బిగ్గరగా కేకవేయును. రంగరా జులికిపడి సత్యవతి కోపముఖము చూచును.)

రం: ....లప్పా!?

( దీనముగా అర్చున )

స: నీ కీ పిచ్చేవిట్రా?

రం: పిచ్చిగాదే, నా కోపం వొచ్చేసిందే. కోడిపిల్లని కొరికితే గాని నా కోపం వోదే, అన్నంరాసు లారగిత్తేగాని నా ఆగ్రగం ఆగదే.

స: ఎందుకురా నీ కోపం? నాన్న నిన్నేమిచేశాడు?

రం: యేం జేశాడంటావంటే యింకాను? నీ మొకం మలుగు మాంలాగు మడతలడిపోయి యెందుకు ముడుసుకు పోయిందే? నీ కళ్లల్లో కాటి కెంత కరిగిపోయిందే! సీతమ్మోరులాగ ను వ్వెంత సింతించేత్తున్నావే? యేడే దీని క్కారణం? బాబుతొత్తుకొడు గ్గాదంటే? యింటాడ బొడుచు నేడిపిత్తాడంటే యీడు? రాఘ్ఘాలు రాళ్లపాలు జేత్తాడంటే? యింకా బతికుంటే యీ దెంద ర్నేడిపిత్తా డోనే. యీడు సత్తేనేగాని మా సత్తెక్క పెళ్లి గాదే. యీడు సత్తేగాని సత్తెక్క పేణం సల్లగుండదే....సంపేత్తానే బాబుని.

స: ఛీ ఛీ.

రం: గుండి లీస్లేస్తానే.

స: వద్దుబాబూ! ...వద్దు....కన్నతండ్రి దైవంరా. తండ్రిపై పగ దైవాపరాధంరా. నాన్న మన కన్యాయం చెయ్యగా రంగా! నా మంచికే మార్గం చూస్తున్నాడు. విషమించింది...అంతేబాబూ!....కోపం మాను....ఓ నాన్న .... వస్తున్నాడు.

రం: వొత్తున్నాడే తొత్తుకొడుకు. మొసల్లాగున్నాడే. కొరిం దెయ్యంలా గున్నాడే. కొండసిలవలా గున్నాడే.

స: (రంగరాజునోరు మూసి) వద్దురంగా! ....వద్దురా. నీవు వెళ్లిపోరా. రేవుకు పోరా.

(రంగరాజు నావలికి నడిపించును)

రం: పటోనే. నువ్వు మరీనే.

(నిష్క్రమించును)

స: అమ్మయ్యో!....ఇదొక ఉపద్రవమా!....భగవంతుడా!

[దాశరాజు ప్రవేశించును]

దా: యేమ్మా! సత్తోతీ! నువ్వియ్యాలా బువ్వ తిన్లేదంటగా?

స: ఆకలి లేదు బాబా!

దా: అవదమ్మా! ఆకలవదు. యెలాగవుద్ది?
ముసురు ముంచుకొచ్చి ముంచింది దేశాన్ని;
యేటి వొరదెలాగు పాటుపడును?
సిన్నకడుపులోను సింత నిండేసింది;
ఆకలెందు కవుతుదమ్మ నీకు? ॥

స: లేదుబాబా! నాకే చింతా లేదు.

దా: తెల్సునమ్మా నాకు తెల్సు. నీకడుపెంత కాలిపోతుందో నాకు తెల్సు. నేనే నీ దురుగతికి క్కారనం.... తెల్సుకున్నా తల్లీ! నా తప్పు దిద్దుకున్నాలే సత్తెమ్మా!

స : ఏఁవిటి బాఁబా ! ?

దా : అదేనమ్మా ! నా కోరికి నేవే మారుసుకున్నాను.

స : ఏ కోరిక బాఁబా ! ?

దా : అదేనమ్మా ! అల్లుడుగార్ని నే నడిగింది. నీ బిడ్డలే అత్తిపట్టానికి పెబువులు గావాలన్నది...మారిసేసుకున్నానమ్మా కోరికి.

[ చటు చటు దేవవ్రతుడు ప్రవేశించును ]

దే : ఏం తాతా ! ? నీ కోరిక యెందుకు మార్చికొన్నావు ?

దా : బాబయ్యా ! బాబయ్యా ! .... అవును బాబయ్యా ! మారుసుకున్నానండీ.

దే : కారణం ?

దా : తప్పు తెల్సుకున్నాను సిన్నబాబూ !...దైవంలాంటి తఁవురుండగా నా మనఁవలు మారాజులు గావాలంటే మాప రాదంవే బాబయ్యా ! లెంపలేసుకున్నా తండీ ! యెయ్యేళ్లకీ మీరే మా యేలికోరు గావాలి బాబయ్యా ! అదే నా కానందం.

దే : ఉఁహుఁహుఁ....పిచ్చితాతా ! దేవవ్రతుని ప్రతిజ్ఞ తిరుగు లేనిది. త్రొక్కిన దారినుంచి తొలగిపోవద్దు. నీ మనసులో కోరిక నీవు మార్చుకొన్నా నా మనోనిశ్చయం నేను మార్చుకోలేను.

క్రక్కినకూటి కాసపడు
కాపురుషుండనె? నాదు నోట నే
నొక్కటిపల్కి చేతునె మ
రొక్కటి? రాజ్యసుఖమ్ముకోసమై
యక్కట! యంతరాత్మ తెగ
నమ్మెదునే? దివిజాపగాసుతుం
గ్రక్కదలింపబోకుమ; జ
గమ్ము సుఖమ్ముగ నుండనీయుమా॥

దాశ తాతా! సాత్యవతేయులే హస్తినాసామ్రాజ్యసార్వభౌము లన్నది శిలాశాసన మైపోయింది. నీ అభీష్టం మార్చుకొనే అగత్యం లేదు. నీ మనుమలకు రాజ్యం వలదనే హక్కు నీ కిప్పుడు రాదు. ఈ యమ్మకొడుకులే యేలకపోతే రాజ్యం పరాధీనం గావలసిందేగాని గాంగేయుడు దానిని తిరిగి గ్రహించడు. ముమ్మాటికీ నమ్ము తాతా!

స: బాబూ! లోకంలో దేవవ్రతు లొక్కరే సత్యవాక్య పరిపాలకులా? తక్కిన ప్రజలందరూ ఆడితప్పేవారు కావలసిందేనా?

దే: నే నలా అనలేదమ్మా! సత్యవ్రతం యెవ్వరికీ జవదాట రానిదే నమ్మా!

స: అవును బాబూ! మీ మాట మీరు నిల్పికోవాలి. నా మాట బోటు పోవాలి.

దే: మీ మాటకు లోటేమి వచ్చింది తల్లీ!?

స : కౌరవరాజ్యం మీకు కానినాడు నాకీ కల్యాణం కారాదిదే బాబూ! శాశ్వతబ్రహ్మచారిణి నౌతానుగాని మీరు రాజ్యభ్రష్టులు కానీ నని నే ననలేదా ?

దే : అమ్మా! మీరు పొరబడుతున్నారమ్మా!

ఆత్మయే మీకు సాక్ష్యమ్మగా నరనాథు
నకు మీరు మనసిచ్చినారుకాదె
మీ తండ్రి నిర్ణేత మీ వివాహమ్మన
కని నాన్నగారితో ననగలేదె
దాశతాతయ్య మీ దాంపత్యమునకు స
మ్మతిజూప సంతసించితిరికాదె
రాజకీయమ్మ లారంభించుముందు మీ
కన్యాశ్రమాశ లేదయ్యెకాదె
మీతలంపు నాకు మేలుసేయంగాని
మొదటి ప్రతినగాదు ; పదును సెడిన
కూడు బాగుసేయ గోరకుమా ; దాశ
తాతకోర్కె మనకు తప్పదమ్మ ! ॥

దా : ఉఁహుఁహుఁ....బాబయ్యా! దాశతాత బుద్ధితక్కువోడ గాకపోతే అంత తెలివిలేని కోరి కెలాకోరుకుంటాడు బాబయ్యా!?

దే : కోరికకు తెలివికావాలా తాతా! ?

దా : కావాలి బాబయ్యా! కావాలి.

గొడ్డుగేది తనకి బిడ్డ గావాలంటె
దేవుడైనకోర్కె తీర్చగలడె ?

అందుకున్న కోర్కి అనబగించేలేని
వొక్కినక్క కంతవోరము తగునె ?॥

దే: అంటే ?....నీ మాట నా కర్థంగాలేదు తాతా !

దా: తాతమాటలో దబ్బరలేదు బాబయ్యా! ఆగ్గేణినై యేదో అడిగేనుగాని నే గోరిన కోరిక తీరీదా? తీరినా తిరంగా ఉండీదా బాబయ్యా !?

దే: ఏమన్నావు? తాతా! దేవవ్రతుడు నీ కిచ్చిన కోరిక తీరనిదా? నిలువనిదా? గాంగేయుని గాడెదను చేస్తున్నావా తాతా !?

దా: కాదుబాబయ్యా! కాదండి. సెమించాలి. దేవరతులో రంటే దేవుడు. సెలవిచ్చినమాట నిలుపుకుంటారు. ఆ మన్నంతదాకా ఆ ఠిచ్చి నోరాని కడ్డులేదు...కాని.... బాబయ్యా! .... కన్నబిడ్డలన్నా కాదనకపోతారా బాబయ్యా !?

దే: ఎవరు కన్నబిడ్డలు ?

దా: తమురుకనబోయీసంతానమే బాబయ్యా! తమురంటోరు తమ కొడుకు లౌతారా బాబయ్యా!? నా మనవల కీనాడు మారాజు లయ్యావొయి సుండదుగందా! మీ బిడ్డలు పెరిగినప్పుడికే ఆళ్ళు పెద్దోళ్లౌతారుగందా? అప్పుడు మనం వుంటామో వుండవోమగందా? 'మా బాబు రాజ్యం మాదిరా. మీ కక్కు లేదురా. పో పొండిరా!' అని మీ బిడ్డలు నామనవల్ని మెడెట్టి నెట్టకపోతారా బాబయ్యా !? అప్పుడు నా కోరిక తీరిందా? మీరిచ్చినోరం జరిగిందా

కౌరవాలంకార వీరగజేంద్రమ్ము
గతిమాలి తిరుగుట కాంచగలనె
జ్యేష్ఠపుత్రుండుండ చిరుతలకున్ రాజ్య
పట్టభద్రపదమ్ము గట్టవలెనె
నాయంత కొడుకు సన్యాసియై నిల్వంగ
కన్యకే నొక తాళి గట్టనగునె
మనుమల నాడించికొనదగ్గ ముదుసలిన్
దగుదని యిపుడు సంతతిని గననె

కటకటా ! శంతనుడు పుత్రఘాతి ధర్మ
దూరుడు పిశాచకామి విద్రోహకారి
చపలచిత్తుడు ననెడి నీచములు నింద
లిన్నిటిని మోసికొనుచు జీవింపగలనె ॥

పదులు మూడి యెల్లసుఖా లనుభవించిన పెద్దకాయ మేనాడో కాడుచూస్తే యీ కానిపనుల కాకారం లేకుండునుగదా ? ఈ కఠోరదృశ్యాలతో కన్నులు కాలి పోకుండునుగదా ? ఈ దుర్యశస్సునకు త్రోవ లేకుండును గదా ? నేను చిరంజీవి నెందుకై పోతున్నాను తండ్రీ ! ? నే జేసిన పాపానికి నిష్కృతి లేదేమో నాయనా ! ?

అం : చిన్నబాబూ ! మా పాపాలకు పరిహారమార్గమే లేదా ? మీ భయంకర ప్రతిజ్ఞలు నిరాఘాటంగా సాగిపోవల సిందేనా ?

సర్వులకు శుభమ్ము సమకూర్చయున్నాడు ;
త్రిప్పికొనుమ నీ ప్రతిజ్ఞ తండ్రి !॥

అం : బాబూ ! యువరాజా !

మాకున్ మాకును సంకటమ్మయిన దు
ర్మార్గమ్ము కా దిప్పు ; డే
చీకుల్ చింతలు లేవు ; సర్వులకు రా
జీయయ్యె ; నిష్టార్థముల్
జేకూరెన్ మనకెల్ల వారలకు ; వ
చ్చెన్ మంచికాలమ్ము ; బా
బూ ! కల్యాణపథమ్ము చూడు ; మిక మా
ర్పుంజేయుమా శబ్దమున్.

దే : ఊఁ ... బాగున్నది .... ఇందరు పెద్ద లేకకంఠంగా ప్రతిజ్ఞ మార్చికొమ్మని ప్రబోధిస్తున్నారు....హరి హరుల సాక్షిగా, ఆత్మసాక్షిగా నే జేసిన ప్రతిజ్ఞ నేనే మార్పు చేసి కోవాలి....ఎందుకు ? భావిసార్వభౌమపద సంపాదన కొఱకు. ఐహికసౌఖ్య సంపదానంద సంస్థాపన కొఱకు. నా ప్రతిజ్ఞ నేనే ప్రతిహతం చేసికోవాలి. నా ప్రతిష్ఠావృక్షాన్ని నేనే పాడుచేసికోవాలి. నన్ను గన్న తల్లి గంగాదేవి పవిత్ర గర్భం నేనే కలుషితం చెయ్యాలి. తాతలు తండ్రులనాటి నుండి ఆర్జించికొన్న కౌరవవంశ గౌరవమర్యాదలు నేనే గంగపాలు చెయ్యాలి. దేవవ్రతు డాడినమాట తప్పిన అధముడన్న అపకీర్తివార్త కాచంద్రతారార్కచిరస్థాయి

నేనే కల్పించాలి... నేనే... నేనే... ఊఁ. బాగున్నది... దాశ తాత తనకోర్కి తానే సవరించికొన్నాడు. అవును, తానే, తానే....మ రెవ్వరూ కారు. తానే తనమాట మరల్చి కొన్నాడు. మంచిమార్గ మవలంబించాడు. తన తప్పు తాను తెలిసికొన్నాడు. దిద్దికొన్నాడు. తన దౌహిత్రుతే హస్తినాపురసింహాసన మలంకరించవలెనన్న ప్రథమ వాంఛను పటాపంచలు చేసికొన్నాడు. గాంగేయుడే భూకాంతుడు కావాలని యిప్పుడు కాంక్షిస్తున్నాడు. అందు కతనికారణం కరతలామలకం. నేను రాజ్యం వదలి కొన్నా నాకు కలుగబోయే సంతానం తమకు రాజ్యం కావా లనవచ్చు. వాళ్లు కలహించవచ్చు. అప్పుడు సాత్యవతేయులు సత్రమాట్టులు కాకపోవచ్చు. అది నా ప్రతిజ్ఞకు భంగపాటేకావచ్చు. దాశతాతకు లభించిన వరం నిరర్థకం గావచ్చు....అవు నవును—తాతకు వచ్చిన సందేహం ధర్మమూలమే. న్యాయమే. సత్యమే....నా బిడ్డలు నేనా? నా సంతానం నా ప్రతిజ్ఞ పరిపాలించేవా శ్యాతారా? ఏమో. నమ్మదగినది కాదు. అది కలలో దొరకిన కనక గిరిగా భావించవలసిందే. దానికి ప్రతిక్రియ తప్పనిదే.... అవును....తప్పదు...అయితే నే నిప్పు డేమి చెయ్యాలి?

శం: మ రేదీకాదు నాన్నా!....నీ ప్రతిజ్ఞ మరలించుకో.

అం: అంతే బాబూ! మీవల్ల యీ నాటకం సంతోషంగా అంతం కావాలి.

స: పెద్దలమాట వినండి బాబూ!

దా: యినుకోండి బాబయ్యా! యినుకోండి.

దే: ఉఁహుఁహుఁ.... పెద్దలందరూ చెప్పినమాటలు విన్నాను. ఆలోచించాను. పునరాలోచించాను. పర్యాలోచించాను. తుదినిర్ణయానికి వచ్చాను. అందరూ వినండి. సావధానంగా ఆలకించండి.

సాత్యవతేయు లేలదగు
సార్వమహీంద్రపదాధికారసా
పత్యనివారణార్థము వి
వాహమునే త్యజియించికొందు; నే
నిత్యము బ్రహ్మచర్యవ్రత
నీమము జేయుదు; పూవుబోంట్ల సాం
గత్యము మానికొందు కల
కాలము నా పితృపాదసాక్షిగన్ ॥

శం: హా గాంగేయా! హా దేవవ్రతా! హా తండ్రీ!

(మూర్ఛగొనును. అంశుమంతు డతనిని పట్టికొనును)

దా: బాబయ్యా! బాబయ్యా! అయ్యబాబోయ్!

(తల మోదికొనుచు నిష్క్రమించును)

స: అయ్యో! హతవిధీ!

(ఏడ్చుచూ నిష్క్రమించును)

అం: భీష్మం!...మహాభీష్మం!...మహాభీష్మప్రతిజ్ఞ!...బాబూ! నీవు కేవలం భీష్ముడవేనయ్యా!

శృంగారమ్ములు పొంగు యౌవనమదో
ద్రేకమ్ము చల్లారి ని
స్సంగత్వ మ్మెటులొందెనో! విపుల రాజ్య
శ్రీ నెటుల్ బాసెనో
సాంగోపాంగము తాను వృద్ధపితకై!
అబ్బా! మహాభీష్మ మీ
గంగాపుత్రకు డిందు జేసిన ప్రతి
జ్ఞల్ రెండు రెండేకదా!॥

బాబూ! గాంగేయా! ఎంత ఘోరభయంకర ప్రతిజ్ఞ చేసే శారయ్యా! ఇంత అమానుషం - అలౌకికం - అపూర్వం - ఏమిటిది బాబూ!? మీరు రాజ్యభ్రష్టులు కావటమే జగత్తునకు సంకటమై ఆబాలగోపాలం ఆక్రందిస్తుంటే యిప్పుడు సర్వసంగపరిత్యాగులై శాశ్వతబ్రహ్మచర్యాశ్రమస్వీకారమే చేస్తారా? ఏమిటిది బాబూ!? రాజపుత్రులకు రాజ్యభ్రష్టత, నవయౌవనకుమారులకు సంసారసన్యాసం యెంత దుస్తరం! యెంత దురాచరణీయం! ఆవంతైనా ఆలోచించారా? బాల్యచాపల్యంతో చేసిన భయంకర ప్రతిజ్ఞలు మీకు యావజ్జీవహృదయశల్యాలై పోవా? ఎంతపని చేశారు తండ్రీ! మీ ప్రథమ ప్రతిజ్ఞను పరిహరింప దలచి చేసిన నా పన్నాగం మీ యైహిక సంసారయాత్రకే అఖండాఘాత మైపోయిందే బాబూ! కాళ్లుకడుగబోయి కన్ను పొడిచిన కసాయినై పోయానా నాయనా!? కౌరవవంశ ప్రభుల ఉప్పుకారాలతో పెరిగిన యీ దుష్టశరీరం

యీనాడు కురువంశపయఃపారావారపూర్ణచంద్రుని సర
నాశనానికి సాయపడిందా దేవవ్రతా! శంతన సాంద
భాముల కనంతసంతాపం నావల్లకూడా వచ్చిందా
చినబాబూ! అయ్యయ్యయ్యో!

దే: విధివిలాసానికి మీ రెందుకు విచారిస్తారు తాతగారూ!

అం: బాబూ! నాకూ నాన్నగారికీ యీ వార్ధక్యదశలో
భరింపరాని బాధ వచ్చింది. ఇక మే మెందుకు బ్రతకాల
బాబూ!?

(శంతనుడు మూర్ఛదేరి కన్నులు తెరచును)

శం: అవును. దేవవ్రతా! ఇక మే మెందుకు బ్రతకాలి?

మా యేకైకకుమారరత్నమునకున్
మా చేతులారంగ మే
మే యింతింత లమానుషాఘములు చే
యింపించి దుష్కీర్తి పా
లై యీ కాయము లేల నిల్పదగు? భ్ర
ష్టాకారు ని న్జేసి మా
శ్రేయోమార్గము లెట్లు చూడనగు? తం
డ్రీ! మమ్ము్మలం గాల్చుమా॥

గాంగేయా! ఇప్పుడు మా కెంత దుస్థితి వచ్చిందో చూడు
నాయనా!

కౌరవాలంకార వీరగజేంద్రమ్ము
గతిమాలి తిరుగుట కాంచగలనె
జ్యేష్ఠపుత్రుండుండ చిరుతలకున్ రాజ్య
పట్టభద్రపదమ్ము గట్టవలెనె
నాయంత కొడుకు సన్యాసియై నిల్వంగ
కన్య కే నొక తాళి గట్టనగునె
మనుమల నాడించికొనదగ్గ ముదుసలిన్
దగుదని యిపుడు సంతతిని గననె

కటకటా! శంతనుడు పుత్రఘాతి ధర్మ
దూరుడు పిశాచకామి విద్రోహకారి
చపలచిత్తుడు ననెడి నీచములు నింద
లిన్నిటిని మోసికొనుచు జీవింపగలనె ॥

పదులు మూడి యెల్లసుఖా లనుభవించిన పెద్దకాయ మేనాడో కాడుచూస్తే యీ కానిపనుల కాకారం లేకుండునుగదా? ఈ కఠోరదృశ్యాలతో కన్నులు కాలి పోకుండునుగదా? ఈ దుర్యశస్సునకు త్రోవ లేకుండును గదా? నేను చిరంజీవి నెందుకై పోతున్నాను తండ్రీ!? నే జేసిన పాపానికి నిష్కృతి లేదేమో నాయనా!?

అం: చిన్నబాబూ! మా పాపాలకు పరిహారమార్గమే లేదా? మీ భయంకర ప్రతిజ్ఞలు నిరాఘాటంగా సాగిపోవల సిందేనా?

[కల్యాణ గౌరాంగులు తొందరగా ప్రవేశింతురు]

క : కాదు కాదు ... ప్రతిజ్ఞలు ప్రతిహతం గాకతప్పదు స్వామీ !

శం : వచ్చావా కల్యాణా ! ? వచ్చావా ?... రా బాబూ ? రా. నీ మిత్రుడు మా కెంత నికృష్టస్థితి తెచ్చాడో చూచా వటయ్యా ! ? రాజ్యత్యాగం చేసినందుకే మా ప్రాణాలు కడబడుతుంటే యీనాడు బ్రహ్మచారినౌతానని భయంకర ప్రతిజ్ఞ చేశాడయ్యా ! నా పెండ్లికోసరం తన సర్వస్వం నాశనం జేసికొంటున్నాడయ్యా ! ఇది న్యాయమా కల్యాణా ! ? మే మెందర మెన్ని చెప్పినా వినలేదు. ఆప్త మిత్రుడవు నీవైనా చెప్పు బాబూ ! ఈ ఆపదలు బాపు నాయనా ! నా కివి గోరుచుట్టుమీద రోకటిపోట్లయ్యా !

క : భయంలేదు మహాప్రభూ ! బాలప్రభువులు సత్యవాక్యపరి పాలకులు. కల్యాణునికి చేసిన వాగ్దానం కాదనరు.

దే : ఏమది కల్యాణా ! ?

క : నాకు మీరు వాగ్దానం జేసిన వరాలు మిగిలిపోయాయి ప్రభూ !

దే : ఓహో ! .... కోరికో కల్యాణా ! శక్తివంచన లేకుండా నీ కోరిన వరా లిస్తాను.

క : అవి మీ చేతిలోనివే ప్రభూ ! మీరు తీర్చగలరు.

దే : అయితే చెప్పు.

క : చిత్తం. చెబుతాను ప్రభూ !

వీరగాథలు విని విని ప్రేమ మించి
మనసు మీ కిచ్చికొంటి ; మీ మహితసేవ
చేసికొనుచుంటి ; నేను వాంఛించియుంటి
ప్రభువు లగువేళ మీ ధర్మపత్నినగుట ॥

శం : ఆఁ !? కల్యాణా !

( ఆశ్చర్యముగా చూచును )

అం : ఇదేమి కోరిక కల్యాణా !?

గా : అసలు నీవు బొమ్మవా ? బొరుసువా ?

దే : కల్యాణా ! ఏఁవిటిది ? కల్యాణు డేఁవిటి, నాకు ధర్మ పత్ని కావటమేఁవిటి ?

క : ఔను ప్రభూ ! పరమరహస్యం యీనాడు బైట పెట్టక తీరదు. ఈ గౌరాంగులవా రెన్నోమార్లు నన్ను నను మానించారు. అనుమానమేగాని వారికి నా అంతు చిక్కలేదు. గుప్తవేషధారినై మీ పవిత్రమూర్తికి పరి చర్యలు చేసికొంటున్నాను. నేను కల్యాణుడను గాను. కల్యాణిని. నా నిజరూపం చూడండి.

( తలమీది పాగా, మూతి మీసమూ తీయును )

శం : ఆఁ !? కల్యాణుడు కాదు....కల్యాణి.

అం : ఆహాహా ! ఎంత చాకచక్యం కల్యాణీ !

గా : పగటివేషధారులకుకూడా యింత కళారచనాప్రభావం లేదేమో ! నే ననుమానిస్తూనే ఉన్నాను గాని

యెన్నడూ ఆరాలు తియ్యలేదు. చాలా చమత్కారంగా పాత్ర సమర్థించికొన్నావు కల్యాణీ!

క : ఔను స్వామీ! యువతిని యువకుడనై తిరిగేను. అవంతీ రాజ కుమార్తెను అనాథకుమారుడనై మీ కగపడ్డాను.

శం : ఓహో! రాజకుమార్తె తప్పిపోయిందని ఆ నాడవంతీ రాజసైనికులు చాలా వెతికారుగా ప్రధానిగారూ!?

అం : ఔను ప్రభూ! కల్యాణి అని పేరుకూడా చెప్పేరు.

గా : ఔను. నిన్న నగరోత్సవకాలంలో దొంగ లెత్తుకొని పోయారటగాదూ?

క : నన్నే స్వామీ! కానీ నన్ను దొంగ లెత్తుకొని పోలేదు. నాకు నేనై వచ్చేశాను. పురుషవేషంతో హస్తినాపురం చేరాను. నా ప్రేమమూర్తి నర్చించికొంటూ అక్కడే నిలిచిపోయాను. వారికి నర్మసఖుడ నయాను. వారి పూర్ణానుగ్రహం పొందాను. వారు నాకు వరాలు వాగ్దానం జేశారు స్వామీ!

అం : అవునవును. అది నే నెరుగుదును. ఆనాడు చిన్నబాబు చాలా పట్టుపట్టేరు. ఏ కోరికలైనా యిస్తా మన్నారు.

శం : ఐతే నీ వెందుకు కోరలేదు కల్యాణీ!?

క : మనవిచేశాగదా ప్రభూ! ప్రపంచంలో నాకు గల కోరిక ఒక్కటే. ప్రభువు లైనవేళ దేవవ్రతులకు ధర్మపత్నిని కావటమే నా నిశ్చయం. చేరువలో నున్న వారి పట్టాభిషేకానికి ముందు నా గుట్టు బైటపెట్ట దలిచికొన్నాను.

అంతవరకూ కోరిక నా గుండెల్లోనే గుప్తపరిచికొన్నాను. ఇప్పటి విషమ పరిస్థితుల్లో చెప్పక తప్పలేదు ప్రభూ!

అం : పాపం! చూడండి చిన్నబాబూ!

కుసుమ కోమలాంగి ; అసమానసుందరి ;
మృదులశీల ; ఘనకులీనురాలు ;
రాజపుత్రి ; మిమ్ము పూజించికొనునది ;
మీకు దగిన కన్నె రాకుమార !॥

శం : అంతేకాదు దేవవ్రతా! ఈ మహాలక్ష్మి మాకు కోడలు కాదగ్గ లక్షణవతి. నీకు తగ్గ యీడు, నీకు నచ్చిన జోడు. ఈ తల్లివల్ల కురువంశం తామరతంపర కాగలదు. ఈమె కోరిక సఫలం గావలసిందే. వాగ్దానం నిలుపుకో బాబూ!

దే : పాపం!...కల్యాణుడు కాదు....కల్యాణి....పాపం!... కల్యాణీ! నీ ఆశలు హతాశలు చేసికొన్నావు....నీవే చేసికొన్నావు....పాపం!

కోరుమి కోరికొమ్మి యెదికోరిన
తీర్తు నటంచు నెంతయో
దూరము వేడికొంటిగద తొల్లిట?
నా మతి మెప్పుగొన్న శ్రృం
గారవతి న్నినున్ సతినిగా గొని
యుండనె నాడు నాడె? నీ
కోరిక దాచినావు ; ప్రతికూలము
దైవము నేడు ప్రేయసీ!॥

రాజ్యము త్యజించికొంటి ; విరాగినైతి
కామసౌఖ్యమ్ములకు ; ప్రతిజ్ఞల్ బొనర్చి
యుంటి ; నీ కెట్లు నే డుపయోగమేను ?
కొట్టుకొనిపోవునావ నెక్కుదువె తరుణి ! ? ॥

క : ప్రభూ ! ప్రభూ ! కల్యాణి బ్రతు కథోగతిపాలు చెయ్యొద్దు. బాల్యమాదిగా మీ పవిత్రగాథలు విని విని ప్రాణ పంచకం మీయందే నిల్పికొన్నాను. వయసు వచ్చినదే ప్రపంచమంతా విడిచికొన్నాను. తలిదండ్రులనూ జన్మభూమినీ త్యజించాను. మీరే సర్వస్వమని నమ్మి మీ సన్నిధి చేరికొన్నాను. మీరే పతి, గతి, భగవంతు డని నమ్మికొన్నాను. మీరు గాని లోకం నాకు మిథ్య. మీరు లేని మహామేరువు నాకు మట్టిగుట్ట. మిమ్ము చూడని నా కన్నుల కన్యదృశ్యా లంధకారబంధురాలు. మీకు గాని యీ శరీరం కాకులకో గ్రద్దలకో. ఈ అబల మానప్రాణ శరీరాలకు మీరే గతి....మీరే అధినేత....ప్రభూ ! కౌరవ ప్రభువంశజు లందరూ సత్యవాక్యపరిపాలకులు. అందు మీ రగ్రగణ్యులు. మీరు వాగ్దానం జేసిన వరాలు మీరే కాదంటే ధర్మదేవత కిక దారిలేదు. ఈ దీనురాలి కోరిక తీర్చక తప్పదు. మీరు ప్రభువులు కాక తప్పదు. నన్ను ధర్మపత్నిగా స్వీకరించక తప్పదు .... మీ పవిత్రపాదాల నుంచి నన్ను వేరుచెయ్యకండి ప్రభూ !

( దేవవ్రతుని పాదములపైన బడును )

శం : రామరామా! రామరామా!

గా : తా బట్టిన కుందేటికి మూడే కాళ్లనకయ్యా చిన్న బాబూ!

అం : కఱకురాళ్లుకూడా కరిగిపోయే కరుణదృశ్యం! చిన్న బాబూ! మేము సహించలేము.

[చలచల సత్యవతి ప్రవేశించును]

స : అవును మహామంత్రిగారూ! కరుణదృశ్య స్పర్శకు కఱకు రాళ్లు కరిగిపోతవి. కఱకురాళ్లలోకూడా కరుణ రసం ఉన్నది. అందు కవి ద్రవిస్తవి. కాని చినబాబుగారి గుండెల్లో వెయ్యి కాగడాలు వేసి వెతికినా దయా దాక్షిణ్యాలు కనుపించవు. కఠిన పాషాణాలకంటె కర్కశ హృదయంతో దేవుడు వీరిని భూలోకంలో పుట్టించాడు కాబోలు. రక్తమాంసాలున్న మానవశరీరా లైతే తండ్రి గారి బాధకు దద్దరిల్లుతవి. తల్లి కన్నీటికి కరిగిపోతవి. భార్య భంగపాటుకు పరితాపపడతవి. ప్రజాపవాదానికి భయపడతవి. చినబాబుగారి గుండెల్లో నున్నవి రక్త మాంసాలు కాదేమో. అమానుషమైన యశోదీక్ష-దైత్య తామసంతో సవరింపబడ్డ ధర్మచింత - పట్టువిడుపుల్లేని పట్టుదల—యివిమాత్రమే ఆ గుండెల్లో గూడుకట్టుకొని కోలాహలం చేస్తున్నట్టున్నవి. పైగా రక్తం త్రాగే రాక్షసవృత్తిగల యోధమూర్తి. వారి నిప్పు దేది కదలించ గలదు? కౌరవసామ్రాజ్యం గంగపాలు గానివ్వండి— మాతాపితలు మలమల మాడి చావనివ్వండి—అమాయిక

ప్రియురాలు కల్యాణి బ్రతు కధోగతి పట్టనివ్వండి-వారు చలింపరు. పితృవాక్యపరిపాలన పేరట జగత్తును బీభత్సం చేస్తారు. ప్రతిజ్ఞలు పరిమార్చికోలేనని అసత్య దోషానికికూడా ఆహుతై పోతారు. కల్యాణికి వరాలు వాగ్దానం జేశారేగాని వరా లివ్వరు. వారి నిప్పుడేమన్నా బూడిదలో బోసిన పన్నీరే స్వామీ! ఊరుకోండి స్వామీ!

దే : అమ్మా! అమ్మా!...ఔరా! దేవవ్రతా! ప్రపంచానికి నీ వెంత పనికిమాలినవాడవై పోయావురా పాపీ!

సకలమ్మున్ త్యజియించికోగలిగియున్
సన్యాసి వయ్యున్ గసా
యికి సామ్యం బయిపోతివేమి యిది? ని
న్నిలోకమే మెచ్చదే?
అకటా! యెల్లరి నేడిపించితివె? నీ
చా! నీ శరీర మ్మికే
టికి? నీ గుండెలు నీవె చీల్చికొని శా
టిం జేరరా శాంతికై.

(గుండెలపైకి కత్తి నెత్తికొనును)

శం : గాంగేయా! గాంగేయా!
అం : చిన్నబాబూ! చిన్నబాబూ!
గా : అయ్యయ్యో! అదేమిటి?
స : బాబూ! బాబూ!

} అందరూ ఒకేసారి అఱచి దేవవ్రతుని పట్టికొందురు.

(తెరలో)

దేవవ్రతు డష్టవసువుల అంశములతో జనించిన అష్టమవసువు. వశిష్టమహర్షి శాపంచేత భూలోకమందు పుట్టినవాడు. ఈతడైహికభోగభాగ్యముల కతీతుడై వేదవిద్యావేత్తయై ధర్మనిష్ఠాగరిష్ఠుడై అజేయయోధమూర్తియై భీష్ముడను పేర చిరకాలము జీవించుట విధివిలాసము. ఇందు కెవ్వరు చింతించిననూ ప్రయోజనములేదు.

స : ఆఁ ! ?

అం : ఆకసవాణి. దివ్యవాక్కు.

శం : శ్రీహరీ !

క : అయ్యో ! హతవిధీ !

గా : ఊఁ (నిట్టూర్చి) ఆ నుదుటివ్రాత అంతేనండి! కాకపోతే యింత అల్లకల్లోలం యెందు కవుతుంది బాబూ ! ?

చెఱగిపోవచ్చు వ్రాతలు శిలలమీద ;
నుదుటిపై శాసనమ్ములు కదుపనగునె ?
బమ్మదయ్యమ్ము గూర్చిన బిమ్మతెగులు
తలగునే యెన్ని నూనెకాకలకునైన ? ॥

అం : అంతేనయ్యా ! అంతే.

శం : ఊఁ (నిట్టూర్చును)

స : (కల్యాణిని కౌగిలించి) అమ్మా కల్యాణీ ! ఎంత దురదృష్టవతివమ్మా ! భారతరాజ్యసార్వభౌమవై మమ్ముల నందరినీ

పరిపాలించదగిన పరిపూర్ణ కళావతివి. విధి నీకు వ్యతిరేకించా డమ్మా! నీ కన్నీరు చూడలేం తల్లీ! విచారించకమ్మా!

(కన్నీరు తుడుచును)

శం: భయపడకమ్మా! కల్యాణీ! నీ యావద్భారం మాది. మా కోడలివి కాకపోవచ్చునుగాని నీవు మా కెప్పుడూ సన్నిహితురాలవే. నీ కర్ధరాజ్య మిప్పిస్తాం. ప్రతిభా వంతుడైన పతి కిచ్చి వివాహం చేస్తాము. కనుఱెప్పలమై నిన్ను కాపాడికొంటాం తల్లీ!

దే: అమ్మా! కల్యాణీ!

నీ వేనాడు తలంపబోకుసుమ యీ
నిర్భాగ్యునిన్ ; నీ సుహృ
ద్భావఘ్నున్ గసిదీర నన్ను ఖరశా
పగ్రస్థునిం జేయుమా ;
దైవానుగ్రహముద్ర గొన్న సుగుణో
త్తంసున్ మతిం గోరుమా ;
ఆ విశ్వేశ్వరి నీకు తోడగునుసు
మ్మా! నన్ను మన్నింపుమా ॥

క: (కన్నీరు తుడిచికొనుచూ) వద్దు ప్రభూ! వద్దు. చెఱకు దిన్న నోట చెప్పు గొరుకలేను. దేవవ్రతుతే యిహపరాల్లో

నా యిష్టదేవత. వారి పాదపద్మాలే నా ఉపాసనా కేంద్రాలు. వారి అడుగుజాడల్లోనే సంచరిస్తాను. వారు స్వీకరించిన బ్రహ్మచర్యమే నేనూ స్వీకరిస్తాను. వారి పవిత్రమూర్తిలో పరబ్రహ్మదర్శనం చేసికొంటూ కాలం గడిపికొంటాను. హిమాలయప్రాంతారణ్యసీమల కిప్పుడే పయనమౌతున్నాను.... సెలవు.

( నిష్క్రమించును )

అం: పాపం ! పాపం !

పాపము ! రాజరాజసుత ;
పల్లవకోమలగాత్ర ; చంద్రబిం
బోపమసుందరానన ; మ
హోత్తమ నిర్మలశీల ; ప్రేమయే
రూపము నెత్తి పుట్టినది
రూఢిగ ; దుర్విధిదగ్ధయై నిరా
శాపరితప్తయై యపద
శాగతయై చనుచుండె నక్కటా ! ॥

శం: పాపం ! చందమామ జారిపోతున్నది.

గా: విధివిలాసం తెలిసికూడా యింకా విచారం యెందుకు మహారాజా ! ?

స : అంతే....పాపం ! విధిని వ్యతిరేకించలేము. ....చిన్నబాబూ ! అజ్ఞానినై మిమ్ములను అనేకవిధాల తూలనాడేను. నాకు పరిహారోక్తి చెప్పండి బాబూ !

దే : తల్లిమందలింపు తనయునికి మేలికొలుపమ్మా ! ఈ చిత్ర నాటకానికి చివరిఫలం సత్యవతీదేవి శంతనసార్వభౌముల సతీమతల్లి కావటమేనమ్మా ! అదే నా ఆత్మ కానందమమ్మా !

గా : అంతే, అంతే, మహారాజా ! మీ రిక మీనమేషాలు లెక్కించి లాభంలేదు.

కడుపులోనికి జనె ముద్ద ; క్రక్కనేల ?
కొలను నిండిన ; దిక గండికొట్టనేల ?
చెక్కుపై చుక్క వడె ; దాని చెఱచుటేల ?
మొగిసె పెండిలి ; యిక పెడముఖ మదేల ? ॥

అం : అంతే మహాప్రభూ ! ఈ వివాహం విధినిర్ణయం. మీ రిక సందేహించవద్దు.

దే : సుముహూర్తం దాటించవద్దు నాన్నగారూ !

శం ; ఊఁ (నిట్టూర్చి) చెయ్యదలంచికొన్నది చినబాబు పెండ్లి. జరిగేది మా వివాహం. తా నొకటి తలిస్తే దైవ మొకటి చేశాడు. ఊఁ....దైవఘటనకు మేమూ తల వంచక తప్పదు. తల వంచుతాము. కన్నీటితో తడిసిన కంకణం చేతికి కట్టుకొంటాము .... అయితే .... దేవవ్రతా !

ఒక్కషరతు. భగవదిచ్ఛకు లోనై నీవు బ్రహ్మచర్యం వహించావు. అయినా నీవు హస్తిపురప్రాసాదమందే నివసించాలి. సామ్రాజ్యానికి నీ భావిసోదరసార్వభౌములకూ అండవై దండవై కన్నాకువై కాపాడాలి. మాకీ ప్రమాణం చెయ్యాలి.

అం: త్రికరణశుద్ధిగా దీనిని పాటించండి చినబాబూ!

దే: అలాగేస్వామీ! మీ యాజ్ఞకు బద్ధుడను.

(శంతనునిచేత చేయి వేయును)

అమ్మా, యిలా రండి తల్లీ!

(సత్యవతి చేయిగొని శంతనునిచేత కలుపును)

గా: శుభం. శుభం ... అయం ముహూర్త శ్శుభముహూర్తోఽస్తు...రండి రండయ్యా కన్యాదాతలు.

[ దాశరాజు, మాతంగి, రంగరాజు ప్రవేశింతురు ]

ఆయురారోగ్య భాగ్యభోగ్యములతోడ
సప్తసంతాన సత్కళాచయముతోడ
ఘనులు మెచ్చెడి రాజ్యసౌఖ్యములతోడ
సంతసముతోడ మీ జంట సాగుగాక!

(అక్షతలు వధూవరులపై చల్లుదురు)

[ మాతంగీ దాశరాజు లానందబాష్పము లొత్తికొందురు ]

దే : ( కన్నీరొత్తికొనుచూ ) ఆహాహా ! ఇప్పటికి పితృవాక్య పరిపాలకుడ నయ్యాను. ఇప్పటికి కృతకృత్యుడ నయ్యాను. ఇప్పటికి నా ఆత్మ శాంతించింది.

శం : బాబూ ! గాంగేయా ! మాకోసం మహాత్యాగాలు చేసిన నీకు మేము చేయగల స్వల్పప్రత్యుపకారం ఒక్కటే.

అంచితతప మ్మొనర్చి యార్జించికొంటి
చిరుతనా డేను స్వచ్ఛందమరణవరము ;
ధారబోసెద నీ కది ; చూరగొనుమ ;
నీవు భీష్ముడ వన చిరంజీవి వగుమ ॥

( సత్యవతి నీళ్లు ధారబోయగా శంతనుడు విడచును )

## భరతవాక్యము

అం : మహిత గాంగేయసుకృత భీష్మప్రతిజ్ఞ
తారకమ్మగుగావుత ! ధరణికెల్ల ;
త్యాగధన బల శౌర్య విస్తారమగుచు
ప్రగతి సాగెడునుంగాక ! జగతియందు ॥

మంగళం